మోహిని అలంకారంలో స్వామివారు

ధ్వజారోహణం

## 2017 మే 31 నుండి జూన్ 8 వరకు తిరుపతిలో జరిగిన శ్రీగోవిందరాజస్వామివారి బ్రహ్మోత్సవ దృశ్యాలు



అశ్వవాహనంపై స్వామివారు



సింహవాహనంపై స్వామివారు



గజవాహనంపై స్వామివారు



గరుడవాహనంపై స్వామివారు



హనుమంతవాహనంపై స్వామివారు



కల్పవృక్షవాహనంపై ఉభయదేవేరులతో స్వామివారు



పట్టువస్త్రాలు సమర్పిస్తున్న తి.తి.దే.జియ్యర్‌స్వాములు



చంద్రప్రభవాహనంపై స్వామివారు



చక్రస్నానం

# భగవద్గీత

**శ్లోకం :** యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః ॥ (గీత.12-17)



**ప్రతిపదార్థం :** యః=ఏ; భక్తిమాన్= భక్తుడు; న హృష్యతి= ఇష్టప్రాప్తికి సంతోషించడో; న ద్వేష్టి= అనిష్టప్రాప్తిని ద్వేషించడో; న శోచతి= ఇష్టవస్తువు నష్టమైతే శోకించడో; న కాంక్షతి= అప్రాప్తాన్ని వాంఛించడో; (మరియు) యః=ఎవడు; శుభ అశుభ పరిత్యాగీ= పుణ్యపాపాలను పరిత్యజించిన వాడో; సః=అతడు; మే=నాకు; ప్రియః=ఇష్టుడు.

**భావం :** శుభం చేకూరితే సంతోషపడడు, కీడు కల్గితే ద్వేషాన్ని పొందడు, ఇష్టమైనది పోయినా దుఃఖించడు, తనకు లేని వస్తువును కోరడు, పుణ్యపాపాలను ఇచ్చే కర్మలను ఆచరించడు – ఇటువంటి భక్తుడే నాకు ఇష్టమైనవాడు.

---



# తానె తానే యిందరి గురుడు....

తానె తానే యిందరి గురుడు ।
సొనబట్టిన భోగి జ్ఞాన యోగి ॥

అపరిమితములైన యజ్ఞాల వడిజేయ ।
బ్రపన్నులకు బుద్ధి వచరించి ।
తపముగా ఫలత్యాగము సేయించు ।
కపురుల గరిమల కర్మయోగి ॥

అన్నిచేతలను బ్రహ్మార్పణవిధి జేయ ।
మన్నించు బుద్ధులను మరుగజెప్పి ।
ఉన్నతపదమున కొనరగ గరుణించు ।
పన్నగశయనుడే బ్రహ్మయోగి ॥

తనరగ గపిలుడై దత్తాత్రేయుడై ।
ఘనమైన మహిమ శ్రీ వేంకటరాయడై ।
ఒనరగ సంసార యోగము గృపసేయు ।
అనిమిషగతుల నభ్యాసయోగి ॥ (4-355)

ఆనందనిలయుడు అందరికీ గురువు! ఆ స్వామి భోగిగా ప్రకాశిస్తున్న అద్భుతమైన జ్ఞానయోగి! యజ్ఞాలే పరమార్థంగా భావిస్తున్న వాళ్లచేతనే యాగఫలాలను త్యాగం చేయిస్తున్న శ్రీవేంకటేశ్వరుడు విచిత్రమైన కర్మయోగి! సమస్త కార్యాలను బ్రహ్మార్పణ బుద్ధితో చేయడం మంచిది అంటూ, అలాంటి వారిని ఉన్నత స్థానాల్లో నిలుపుతున్న బ్రహ్మయోగి శ్రీశేషశాయి శ్రీనివాసుడు! ఒకప్పుడు కపిలుడిగా, మరొకప్పుడు శ్రీదత్తాత్రేయస్వామిగా అవతరించిన శ్రీవేంకటేశ్వరుడు, 'సంసారం కూడా ఒక యోగం' అంటూ ప్రస్తుతం సామాన్యులను కూడ రెప్పవాల్చకుండా అనుగ్రహించడానికి అభ్యాసం చేసిన పరమయోగి ఆనందనిలయుడు!



# మీ మాట

### చాలా బాగుంది

మే నెల 'సప్తగిరి' మాసపత్రిక 'మందరోద్ధార! నమో నమః' డా॥రేవూరు అనంతపద్మనాభరావుగారి వ్యాసం కూర్మావతార స్వరూప మహిమ చాలా చక్కగా తెలిపారు. శ్రీభగవద్రామానుజుల సహస్రాబ్ది జయంతి విశేష సంచిక చాలా బాగుంది. ప్రచురించిన ప్రధాన సంపాదవర్గానికి అభినందనలు. *– ఎల్.ప్రపుల్లచంద్ర, ధర్మవరం.*

### నచ్చినవి

సప్తగిరిలో ప్రతినెలా వెలువడుతున్న 'కైంకర్యమే తనువు దాల్చితే' ధారావాహిక మాకు ఎంతగానో నచ్చింది. శ్రీభగవద్రామానుజుల వారి సహస్రాబ్ది ఉత్సవాల సంద ర్భంగా తి.తి.దే. నిర్వహించిన వివిధ విశేష కార్యక్రమాలు దృశ్యమాలికలు చాలా బాగుంది. శ్రీరామదూతం శిరసా నమామి వంటి వ్యాసాలు మమ్మల్ని ఎంతగానో ఆకట్టు కున్నాయి. *– నిష్ఠల నాగేంద్రప్రసాద్, హైదరాబాదు.*

### నమస్కారాలు

మే నెల 'సప్తగిరి'లో శ్రీత్యాగరాజస్వామివారి జీవిత గాథలో ప్రముఖమైన తెరతీయగరాదా సన్నివేశానికి అందులోని గూఢార్థమును ఆధ్యాత్మికతను రంగరించి వేదాంతపరంగా తెలిపినందుకు పమిడికాల్వ చెంచుసుబ్బయ్య గారికి మా నమస్కారములు. సంభాషణా చాతుర్యాలతో పాఠకులను ఆకట్టుకొనే రీతిలో నూతనపంథాలో సర్వపాఠక సమ్మోహనంగా ఆకర్షణీయంగా విప్రనారాయణ చరిత్ర వ్రాసిన శ్రీ సర్వోత్తమరావుగారికి మా ధన్యవాదాలు.

*– ఆచార్య కె.ఎన్.రావు, సూర్యనారాయణ, ఖమ్మం.*

### హృదయాంజలి

మే నెల మధ్యపుటల వర్ణచిత్రాలు చాలా బాగు న్నాయి. నీ దయా ఋణం ఏలా తీరేది, సేవ ఒక భాగ్యం వంటి వ్యాసాలు ఆకట్టుకున్నాయి. ఎనలేని సేవలు చేసిన రామానుజులగారికి మా హృదయాంజలి.

*– మద్ది వేంకటవరరావు, కృష్ణాజిల్లా.*

### శుభాకాంక్షలు

'ఒక బాలుడికోసం' డా॥ కంపల్లె రవిచంద్రన్‌గారి రచన బాగుంది. వ్యాసాలు చాల బాగుంటున్నాయి. పత్రికా సిబ్బందికి ధన్యవాదాలు. ఇంత చక్కని పత్రికను అందిస్తున్నం దుకు మీకు మా శుభాకాంక్షలు.

*– వైదా ఈశ్వరరావు, మింది.*

### ఆకట్టుకున్నాయి...!!

ఏప్రిల్ నెలలో సప్తగిరి మాసపత్రికలో వచ్చిన వ్యాసాలు ధారావాహికలు చాలా ప్రత్యేకంగా ఉన్నాయి. ముఖ్యంగా రాజీవలోచనుడు, తిరుమలలో వసంతోత్సవాలు, అంతా రామమయం, ధర్మబోధ మొదలైనవి మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకున్నాయి. *– కె.అనన్య, ఆదిలాబాదు.*

### అభినందనలు

'పరమయోగి విలాసం' ధారావాహిక ప్రతినెలా కొత్త కొత్త మలుపులతో మమ్మల్ని ఆసక్తికి గురిచేస్తున్నది. ప్రతి మాసం మా ఇంట్లో అందరూ సప్తగిరి మాసపత్రిక కోసం ఎదురుచూస్తూ ఉంటాము. సప్తగిరి మాసపత్రికలో వచ్చే సూక్తులు పాఠకులను ఆలోచింపజేసేవిగా ఉన్నాయి. ఇందులో వచ్చే శీర్షిక దేనికదే ప్రత్యేకంగా ఉండి మమ్మల్ని ఎంతో ఆకర్షిస్తోంది. తి.తి.దే. నూతన శ్రీ కార్యనిర్వహణాధి కారిగారైన శ్రీ అనిల్‌కుమార్ సింఘాల్ గారికి మా హృదయ పూర్వక అభినందనలు.

*– సి.శ్రీనివాసరావు, సి.జయలక్ష్మి, కడప.*

## 2017 ఆగష్టు నెల ఉత్సవాలు, పర్వదినాలు

| | |
|---|---|
| 03-05 | తిరుమల శ్రీవారి పవిత్రోత్సవాలు |
| 04 | శ్రీవరలక్ష్మీవ్రతం |
| 07 | జంధ్యాలపూర్ణిమ, |
| | హయగ్రీవ జయంతి, |
| | శ్రీవిఖనస జయంతి |
| 15 | గోకులాష్టమి |
| | స్వాతంత్ర్య దినోత్సవం |
| 23 | శ్రీబలరామ జయంతి |
| 24 | శ్రీవరాహ జయంతి |
| 25 | శ్రీవినాయకచవితి |

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

# సప్తగిరి

సంపుటి : 48 జూలై, 2017 సంచిక : 02



వేంకటాద్రి సమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన।
వేంకటేశ సమో దేవో
న భూతో న భవిష్యతి ॥

## ఈ నెలలో....



ముఖచిత్రం : తిరుమల శ్రీవారి ఆణివర ఆస్థానం
వెనుక చిత్రం : శ్రీ చక్రత్తాళ్వారు వర్ష తిరునక్షత్రం


**గౌరవ సంపాదకుడు**
శ్రీ అనిల్‌కుమార్ సింఘాల్, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు.

**ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు**
డా॥ కె.రాధారమణ, ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

**సంపాదకుడు**
డా॥ వి.జి.చొక్కలింగం, ఎం.ఏ., పిహెచ్.డి.,

**ఉపసంపాదకురాలు**
డా॥ అల్లాడి సంధ్య,
ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి., పి.జి.డిప్లొమా ఇన్ జర్నలిజం

**ముద్రాపకుడు**
డా॥ టి. రవి, ఎం.ఏ., పిహెచ్.డి.,
పౌరసంబంధాధికారి, తి.తి.దే., తిరుపతి &
ఉపకార్యనిర్వహణాధికారి
(ప్రచురణలు & ముద్రణాలయం) ఎఫ్.ఏ.సి., తి.తి.దే., తిరుపతి

**చిత్రకారుడు**
శ్రీ పి.శివప్రసాద్, తి.తి.దే., తిరుపతి.

**ఫోటోలు**
శ్రీ పి.ఎన్.శేఖర్, ఫోటోగ్రాఫర్, తి.తి.దే.
శ్రీ పి.వెంకట్రమణ, సహాయఫోటోగ్రాఫర్, తి.తి.దే.,



సప్తగిరి మాస పత్రిక

ఇతర వివరాలకు
0877-2264543

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ. 500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-




24 గంటలూ పనిచేసే
తి.తి.దే. కాల్‌సెంటర్ ఫోన్ నెం.
0877 2277777 / 2233333



వెబ్‌సైట్- www.tirumala.org, www.tirupati.org; ఆన్‌లైన్ సేవలు/వసతిసౌకర్యం కొరకు- www.ttdsevaonline.com

## సంపాదకీయం

# వ్యాసపూర్ణిమ

'గురు' అనే పదానికి అజ్ఞానం అనే అంధకారాన్ని తొలగించేవాడు అని అర్థం.

అంటే జ్ఞానప్రదాత గురువు అందరికంటే గొప్పవాడు అని అర్థం. ఎందుకంటే దేశాన్ని ఏలే రాజునైనా తయారు చేసేది గురువే. అందరి వందనాలు స్వీకరించే ఆ ప్రభువు సైతం తలవంచి పాదాభివందనం చేసేది గురువుకే. గురువు అనగానే ముందు మనకు గుర్తొచ్చేది శ్రీ వేదవ్యాస మహర్షి.

'వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే' అని విష్ణుసహస్రనామం పేర్కొంటుంది. సాక్షాత్తు విష్ణుభగవానుడు పరాశర మహర్షికి కృష్ణద్వైపాయనుడిగా అవతరించాడు. ఆయనే అనంతమైన వేదాలను వింగడించి "వేదవ్యాస భగవానుడి"గా ప్రసిద్ధి పొందాడు. ఆయన అవతరించిన "ఆషాఢ పూర్ణిమ" – "వ్యాసపూర్ణిమ"గా, "గురుపూర్ణిమ"గా వ్యాప్తి పొందింది. అన్ని సంప్రదాయాలవారు తమ తమ గురువులను ఆరాధించే విశిష్టపర్వదినంగా ప్రసిద్ధి పొందిన దినం ఈ "గురుపూర్ణిమ".

మానవులకు తొలిగురువు తల్లి. లౌకిక విషయాలను నేర్పే మలి గురువు తండ్రి. తర్వాత స్థానం విద్యను ఉపదేశించే గురువుది. గురువు అనుగ్రహం వల్లనే శిష్యులు ఆత్మజ్ఞానాన్ని పొందుతారు. అలాంటి జ్ఞానాన్ని బోధించేవాళ్ళే సద్గురువులు.

కేవలం పుస్తకంలోని విద్య విద్యే కాదు, దాన్ని బోధించేవాడు మాత్రమే గురువు కాదు. ప్రకృతిలో ఎన్నో విద్యలున్నాయి. ఎన్నో విషయాలను గురువుగా ప్రకృతి నేర్పుతుంది.

సమయ పాలన గురించి సూర్యుడు, ఇచ్చిపుచ్చుకునే ధోరణికి వృక్షాలు, సహనం కలిగి ఉండాలని భూమి ఇలా పంచభూతాలు గురువులై అనేక విషయాలు బోధిస్తాయి. వీటితో పాటు చీమలు క్రమశిక్షణతో కష్టపడి పనిచేయమని బోధిస్తాయి. తేనెటీగలు సంఘీభావాన్ని, పువ్వు బ్రతికినన్నాళ్లు ఆనందాన్ని పంచుతూ, జీవితం ముగిశాక మౌనంగా నిష్క్రమించు అని బోధిస్తాయి. అపజయంతో క్రుంగక జయాన్ని పొందమంటుంది చిగురిస్తున్న మొక్క. వైశాల్యాన్ని ఆకాశం, ధీరత్వాన్ని, ఔన్నత్యాన్ని కొండ బోధిస్తుంది. ఇవన్నీ మానవునికి పరోక్షంగా గురువులే. కాబట్టి వీరందరి బోధనలను ఒంట పట్టించుకుని పురోగమిస్తే మానవుడి మనుగడ పతాకాస్థాయిలో ఎగురుతుంది. ఇలా విశ్వంలోని అణువణువుగా గురుతత్త్వం భాసిస్తోంది.

అందువల్లే "గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః" అంటూ త్రిమూర్తి స్వరూపంగా గురువు సంభావింపబడుతున్నాడు. త్రిమూర్త్యాత్మకుడైన గురువులో విశ్వం ఉంది. విశ్వమంతటా గురువు ఉన్నాడు. ఈ విశ్వంలో గురువు కానిది ఏదీ లేదు. అలాంటి సద్గురువులను స్మరిస్తూ, 'గురుస్సాక్షాత్పర బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః' అంటూ మనం అందరం భక్తి ప్రపత్తులతో గురువులకు శిరస్సువంచి ప్రణామాలర్పిద్దాం. ఇహపరజ్ఞానాల్ని సమృద్ధిగా పొందుదాం.

*'గురవేనమః'*

# ఆనందనిలయుని... ఆణివర ఆస్థానం

- శ్రీ జె.బాలసుబ్రహ్మణ్యం



శ్రీ శ్రీనివాసః పరదైవతం నః
శ్రీ శ్రీనివాసః పరమం ధనం నః
శ్రీ శ్రీనివాసః కులదైవతం నః
శ్రీ శ్రీనివాసః పరమా గతిర్నః

నిరంతరం నిరంతరాయంగా, రాత్రి బ్రహ్మాదిదేవతల చేతా, పగలు మానవుల చేతా సేవింపబడుతూ, తన కడ గంటి చూపులతో అందరినీ సంపూర్ణంగా అనుగ్రహిస్తున్న శ్రీనివాస ప్రభువునకు, సాటిరాగల దేవుడు ఇంకొకడు లేడు, లేనే లేడు. ఆ దేవునికి సాటి ఆ దేవుడే. అలాంటి సర్వజగత్ప్రభువైన తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారికి జరుగుతున్న వార్షిక ఉత్సవాల్లో అత్యంత ప్రాధాన్యతను సంతరించుకొన్నది **ఆణివరోత్సవం.**

ఇది ప్రతి సంవత్సరం సౌరమానం ప్రకారం దక్షిణాయన పుణ్యకాలంలో అంటే కర్కాటక సంక్రాంతినాడు జరుపబడుతుంది. ఈ సంక్రాంతి సర్వసాధారణంగా జూలై 16వ తేదీన వస్తుంది. సౌరమానాన్ని అనుసరించే తమిళుల కాలమానం ప్రకారం ఆణిమాసం తొలిరోజున (జూలై 16న) జరుపబడే ఆస్థానం (కొలువు) కనుక **'ఆణివర ఆస్థానం'** అని పిలువబడుతున్నది.

ఈ ఆణివర ఆస్థానం జరిగేటప్పుడు ప్రతిరోజు ఉదయం సుప్రభాతం, విశ్వరూపదర్శనం, తోమాలసేవానంతరం స్నపనమండపంలో శ్రీవేంకటేశ్వరస్వామి (కొలువుమూర్తి) ఛత్ర చామర మర్యాదలతో, బంగారుసింహాసనంపై కొలువుదీరగా, దేవస్థాన ఉద్యోగభృత్య బృందం, స్వామివారికి పంచాంగ శ్రవణం చేయిస్తారు. ఆనాటి తిథి, వార, నక్షత్రవిశేషాలతో పాటు, ఉత్సవవిశేషాలు స్వామివారికి వినిపిస్తారు. అంతేగాక ముందునాటి ఆదాయాన్నీ, బంగారం, వెండి నగలు, పాత్రలు మున్నగు సమస్తవస్తువుల విలువను లెక్కలు గట్టి మొత్తం నికరాదాయాన్ని పైసల వరకు కూడ శ్రీస్వామివారికి అత్యంత భక్తిప్రపత్తులతో చదివి వినిపిస్తారు. ముందునాడు దర్శనం చేసుకొన్న భక్తుల సంఖ్యనుకూడ తెలపడం జరుగుతుంది. ఈ విన్నపాలను కొలువుదీరి ఉన్న శ్రీస్వామివారు మహాదర్పంగా ఆలకించి, ఆనందిస్తూ, భక్తులను అనుగ్రహిస్తూ ఉంటారు. ఇది ప్రతినిత్యం జరిగే శ్రీవారి ఆస్థానం.

కానీ, రోజూ జరిగే ఆస్థానం కంటే కూడ దక్షిణాయన పుణ్యకాలమైన జూలై 16న జరిగే ఆణివర ఆస్థానం చాల విశిష్టమైంది. తిరుమల ఆలయచరిత్రలోనే అత్యంత ప్రాధాన్యతను సంతరించుకొంది.

ప్రతిరోజూ మాదిరే దక్షిణాయన సంక్రమణం రోజున (జూలై 16న) ఉదయం శ్రీస్వామివారికి సుప్రభాతం, విశ్వరూపదర్శనం, తోమాలసేవ యథాప్రకారం జరుగుతాయి. అయితే

**2017, జూలై 16 తేదీన ఆణివర ఆస్థానం సందర్భంగా..**

రోజూ జరిగే కొలువు శ్రీనివాసమూర్తికి బంగారు సింహాసనంపై కొలువు జరుపబడదు. తోమాలసేవ అయిన వెంటనే శ్రీదేవి భూదేవేరులతో కూడి ఉన్న శ్రీమలయప్పకు (ఉత్సవమూర్తులు) శ్రీవిష్వక్సేనుల (శ్రీస్వామివారి సేనాధిపతి) వారికీ ఆలయంలోనే ఏకాంతంగా తిరుమంజనం (అభిషేకం) జరుపబడుతుంది. పిదప, మొదటి సహస్రనామార్చన, నైవేద్యం (మొదటిగంట) జరుపబడతాయి.

పిదప బంగారువాకిలి ముందుగల తిరుమహామణి (ఘంటామండపం) మండపంలో సర్వభూపాలవాహనంలో ఉభయదేవేరులతో కూడిన శ్రీస్వామివారిని బంగారువాకిలి ముందుగా గరుత్మంతునికి అభిముఖంగా కొలువుకు వేంచేపు చేస్తారు. సర్వాభరణాదులతోను, సుగంధపరిమళభరితమైన పుష్పమాలికలతోను, ఉత్సవమూర్తులను విశేషంగా అలంకరిస్తారు.

శ్రీస్వామివారికి ప్రక్కగా చెరొకపీఠంపై దక్షిణాభిముఖంగా శ్రీవిష్వక్సేనులవారిని కూడ వేంచేపు చేసి ఆభరణాలతో, పుష్పమాలలతో అలంకరిస్తారు. శిరస్త్రాణాన్ని, ఖడ్గాన్ని ధరించి అత్యంత భయభక్తులతో శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆజ్ఞలను అమలుపరచడానికి సిద్ధమై సర్వసన్నద్ధమై ఉంటాడు సేనాధిపతి.



అనంతరం ఆనందనిలయంలోని మూలవిరాట్టునకు, బంగారువాకిలిదగ్గర ఆస్థానంలో వేంచేపు చేసి ఉన్న శ్రీవారి ఉత్సవ మూర్తులకు, సేనాధిపతికి విశేషమైన ప్రసాదాలు ఈ విధంగా నివేదింపబడతాయి.

శ్రీమాన్ పెద్దజియ్యంగార్లు, చిన్నజియ్యంగార్లు, ఏకాంగులు, అర్చకులు, ఆచార్యపురుషులు, వేదపండితులు, దేవస్థానం కార్యనిర్వాహకులు, ఇతర అధికార్లు, దేవాలయ సహాయ కార్యనిర్వహణాధికార్లు, పారుపత్యదార్లు ఛత్రచామరాలతో, మంగళవాయిద్య పురస్సరంగా, వేదపండితులు వేదపారాయణ చేస్తూ వెంటరాగా గమేకార్లు (వంటశాలనుండి ప్రసాదాన్ని నివేదనకు వండి తెచ్చి సమర్పించేవాళ్లు) సిద్ధమై ఉన్న విశేషమైన వంటకాలను (పొంగలి, చక్కెరపొంగలి, పులిహోర, దధ్యోదనం, మళహోర, లడ్డు, వడ, అప్పం, దోసె మున్నగువాటిని) నివేదనకు తెస్తారు. విమాన ప్రదక్షిణంలో బంగారుబావి ప్రక్కన ఉన్న వంటశాలనుండి బయలుదేరి ఈ ప్రసాదాలను ఆనంద నిలయానికి ప్రదక్షిణం చేస్తూ, వెండివాకిలి ఎదురుగా బయట ఉన్న ధ్వజస్తంభానికి ప్రదక్షిణంగా వెళ్ళి, లోనికి వచ్చి ఆలయ ప్రవేశం చేసి, అటు మూలసన్నిధిలోనూ, ఇటు బంగారువాకిలి దగ్గర ఆస్థానంలోనూ నివేదనకు ఉంచుతారు. రెండుచోట్ల గంటలు మ్రోగుతుండగా ఈ విశేష నైవేద్యం జరుగుతుంది.

ఈ నైవేద్యం అయిన పిదప యోగనరసింహస్వామి ఆలయం ప్రక్కన వున్న 'పరిమళపు అర' దగ్గరనుండి శ్రీమాన్ పెద్ద జియ్యంగార్లు పెద్ద వెండితట్టలో మడతపెట్టి చుట్టగా చుట్టబడిన ఆరు పెద్ద పట్టువస్త్రాలను తలమీద పెట్టుకొని, ఛత్రచామర మంగళ వాయిద్య పురస్సరంగా, ముందు పంచముఖ దివిటీలు వెలుగుతుండగా, సన్నడోలు, పలక, గంటలు మోగుతుండగా, వేదపారాయణాలు సాగుతుండగా, శ్రీమాన్ చిన్నజియ్యంగారు, ఏకాంగులు, దేవస్థానం కార్యనిర్వహణాధికారి, సంయుక్త కార్యనిర్వహణాధికారి, దేవాలయ ఉపకార్యనిర్వహణాధికారి, సహాయకార్యనిర్వహణాధికారి, పారుపత్యదారు మున్నగు ఆలయఅధికారులు వెంటరాగా, ఆలయం వెండివాకిలి ముందున్న ధ్వజస్తంబానికి ప్రదక్షిణంగా వచ్చి పిదప ఆనందనిలయ విమానానికి ప్రదక్షిణం చేస్తూ వచ్చి నేరుగా ఆనందనిలయంలోని శ్రీస్వామివారి మూలమూర్తుల దగ్గర సమర్పి





స్తారు. పెద్దజియ్యంగారు, చిన్నజియ్యంగారు, ఏకాంగులు మాత్రమే ఆనందనిలయ ప్రవేశం చేస్తారు. అర్చకులు వెంటనే కులశేఖరపడి (శ్రీస్వామి వారి ముందు ఉన్న గడప) దగ్గర తెరవేస్తారు. లోపల అర్చక స్వాములు శ్రీజియ్యంగారు సమర్పించిన ఆరు పట్టువస్త్రాల్లో నాలిగింటిని శ్రీవారి మూలమూర్తికి అలంకరిస్తారు. ఒకటి కిరీటానికి, రెండవదాన్ని నందకఖడ్గానికి, మూడవదాన్ని పంచగా, నాలుగవదాన్ని అంగవస్త్రంగా అలంకరిస్తారు. తెరతొలగించిన తర్వాత అర్చకస్వామి శ్రీవేంకటేశ్వరస్వామివారి మూలమూర్తి శిరస్సుకు పరివట్టం (పట్టుగుడ్డ) కట్టి పూజా హారతులు చేస్తారు. హారతి అయిన తర్వాత ప్రధాన అర్చకులు తాము ముందుగా తీర్థం స్వీకరించి, శఠారి మర్యాద స్వీకరిస్తారు.

ఆ తర్వాత శ్రీజియ్యంగారు కులశేఖరపడి ఇవతలికి వచ్చి తీర్థం స్వీకరించి, మళ్లీ గడపలోపలికి వెళ్లి శఠారి మర్యాదలు స్వీకరిస్తారు. అట్లే చిన్నజియ్యంగార్లు ఏకాంగి కూడ. (ఆనంద నిలయం లోపల అర్చకులు తప్ప ఇతరులు తీర్థం స్వీకరింపరు). తదుపరి హారతి తీర్థం శఠారి మర్యాదలు, దేవస్థాన కార్యనిర్వాహకులకు, ఆలయ అధికార్లకు, మిరాశిదార్లకు జరుగుతాయి. అందరికీ తీర్థం, చందనం, శఠారి, తాంబూల మర్యాదలు అయిన తర్వాత శ్రీజియ్యంగార్ మిగిలిన రెండు పట్టువస్త్రాలను తలపై పెట్టుకొని బంగారువాకిలి దగ్గర ఆస్థానంలో వేంచేసి ఉన్న ఉత్సవ మూర్తులకు సమర్పిస్తారు. అర్చకులు ఆ రెండు పట్టు వస్త్రాల్లో ఒకదానిని శ్రీమలయప్పస్వామి వారికి, రెండవ దానిని విష్వక్సేనుల వారికి అలంకరిస్తారు.

పిదప ప్రధాన అర్చకులు తమ తలకు శ్రీవారి పాద వస్త్రంతో పరివట్టం (తలకు చుట్టూ కట్టే చిన్న పట్టు గుడ్డ) కట్టుకొని శ్రీస్వామివారలపై విష్వక్సేనులపై కుంకుమాక్షతలు చల్లుతారు. ఆ తర్వాత సేనాధిపతివారికి పరివట్టం కట్టి శ్రీస్వామివారికి చల్లిన అక్షతలను విష్వక్సేనులపై చల్లి, శఠారి మర్యాదలు జరుపుతారు.

తర్వాత అర్చకులు శ్రీస్వామివారి ద్వారా తండుల దానం (బియ్యం) దక్షిణ స్వీకరించి 'నిత్యైశ్వర్యోభవ" అని స్వామి వారిని ఆశీర్వదిస్తారు. తదుపరి అర్చకులు శఠారి మర్యాదలు స్వీకరించి, పిదప స్వామివారికి కొలువు, మంగళహారతి జరుపుతారు. ఈ కొలువులో నువ్వులపిండిని స్వామివారికి నివేదిస్తారు.

**పూర్వం తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆదాయ వ్యయాలు, నిలువలు మున్నగు సంవత్సర లెక్కలు ఈ ఆణివర ఆస్థానం రోజునుండే ప్రారంభమయ్యేవి. కాని దేవస్థానానికి ధర్మకర్తల మండలి ఏర్పడిన తర్వాత ఈ లెక్కల ప్రారంభం వర్తమాన "బడ్జెట్" లెక్కల కనుగుణంగా "మార్చి-ఏప్రిల్"కు మార్చుకొనడం జరిగింది.**

ఆ తర్వాత అర్చకులు పెద్దజియ్యంగారికి పరివట్టం కట్టి శ్రీస్వామివారి పాదాలవద్ద ఉంచబడిన శ్రీజియ్యంగారి స్వంత మొహరును (సీలు) జియ్యంగార్ చేతికిచ్చి, దేవస్థానం వారి "లచ్చన" అను తాళంచెవుల గుత్తిని, వారి కుడిచేతికి తగిలించి శ్రీస్వామివారికి హారతి జరిపి, తీర్థ, చందన, శఠారి మర్యాదలు జరుపుతారు. తర్వాత బీగంచెవుల గుత్తి శ్రీస్వామి వారిపాదాలవద్ద ఉంచబడుతుంది.

అట్లే శ్రీచిన్నజియ్యంగారికి, స్వంత మొహరును చేతికిచ్చి బీగంచెవుల గుత్తిని 'లచ్చన'ను చేతికి తగిలించి హారతి తీర్థ శఠారి చందనతాంబూల సత్కారాలు జరుపబడు తాయి. ఆ తర్వాత ఏకాంగికి కూడ పై మాదిరే జరుగుతాయి.

ఆ తర్వాత తిరుమల తిరుపతి దేవస్థానం తరుపున ఉన్నతాధికారి అయిన శ్రీకార్యనిర్వహణాధికారులవారికి మాత్రమే పరివట్టం కట్టి దేవస్థానం మొహరును, బీగంచెవుల గుత్తి 'లచ్చన'ను చేతికి తగిలించి హారతి, చందనతాంబూల తీర్థ శఠారి సత్కారాలు జరుగుతాయి.

పిదప ఏకాంగి తలకు పరివట్టం కట్టుకొని ఆస్థానంలో వేంచేసి ఉన్న భక్తులచేత శ్రీస్వామివారికి కానుకలను వసూలు చేసి, కార్యనిర్వాహకులకు సమర్పించును. ఆయన వాటిని ఒక సంచీలో పెట్టి సీలు చేసి, వెండితట్టలో తలపై పెట్టుకొని వెళ్లి, శ్రీవారిహుండీలో సమర్పిస్తారు.

ఏకాంగి వారికి శఠారి మర్యాదలైన తర్వాత, శ్రీకార్యనిర్వాహకులకు హారతి, తాంబూలం, తీర్థ, శఠారి

**తిరుమల శ్రీవారి ఆలయంలో లాగే ఆణివర ఆస్థానం తిరుపతి శ్రీగోవిందరాజస్వామి ఆలయంలోను జరుగుతుంది. అయితే తిరుమలలో ఉదయం జరిగితే, అదే రోజు సాయంత్రం తిరుపతి శ్రీగోవిందరాజస్వామి ఆలయంలో జరుగుతుంది. తిరుమలలో పై కార్యక్రమంలో పాల్గొన్న శ్రీజియ్యంగార్లు పాల్గొనడానికి వీలుగా తిరుపతి శ్రీగోవిందరాజస్వామి ఆలయంలో సాయంత్రం జరుగుతుంది.**

**అలాగే తిరుపతి శ్రీ కోదండరామాలయంలో మరునాడు ఉదయం ఆణివర ఆస్థానం జరుపబడుతుంది.**

మర్యాదలు జరుగుతాయి. ఆ తర్వాత దేవస్థానం ధర్మకర్తల మండలి అధ్యక్షులకు, సభ్యులకు, సంయుక్త కార్యనిర్వాహకులకు, తిరుమల ఆలయ ఉపకార్యనిర్వాహకులకు, సహాయకార్యనిర్వహణాధికారి, పారుపత్యదారులకు, హారతి శఠారి తాంబూల మర్యాదలు జరుగుతాయి.

పిదప గమేకార్, మహంతు, మైసూరు రాజా, తాళ్ల పాకం, తరిగొండవారి హారతులు జరుగును. ఆ తర్వాత అక్కడికి వచ్చిన భక్తులందరి తరుపున ఒక్కొక్క రూపాయి వసూలు చేసి అందరికి కలసి **"రూపాయి హారతి"** ఇవ్వబడుతుంది. ఈ హారతికి వసూలు కాబడిన రూపాయలను వెంటనే కార్యనిర్వాహకుల సమక్షంలో ఖజానాకు జమ చేయబడుతుంది.

మళ్లీ చివర్లో శ్రీజియ్యంగారికి, శ్రీకార్యనిర్వహణాధికారికి మాత్రమే పరివట్టం కట్టబడి శఠారిమర్యాదలు ఇవ్వబడతాయి.

అనంతరం శ్రీస్వామివారికి నివేదింపబడిన ప్రసాదాలు వగైరా, వారివారి స్థానీయ హోదాను బట్టి వరుసగా ప్రసాద వితరణ జరుగుతుంది. ఆ తర్వాత, భక్తులకు కూడ ప్రసాదం పంచబడుతుంది. ఈ ఆణివర ఆస్థానం రోజున ఆర్జిత ఉత్సవాలు జరుపబడవు.

పిదప, శ్రీస్వామివారు దేవేరులతో కూడి ఆ మండపంలోనే (రెండవగంట) మధ్యాహ్నం నైవేద్యం అయ్యేంతవరకు ఉంటారు. తర్వాత ఆ సాయంత్రం తిరుమల పురవీథులగుండా రమణీయంగా అలంకరింపబడ్డ **పుష్ప పల్లకి**లో అత్యంత వైభవంగా ఊరేగింపబడతారు.

ఈ పుష్పపల్లకీ వైభవం చూడవలసిందేగాని వర్ణింప సాధ్యం కాదు. ఉత్సవానంతరం శ్రీస్వామివారు దేవేరులతో ఆలయప్రవేశం చేస్తారు.







# గరుడపంచమి

- శ్రీ ఐ.ఎల్.ఎన్.చంద్రశేఖర రావు

శ్రావణమాసంలో శుక్లపక్షపంచమి– 'గరుడపంచమి'. శ్రీమహావిష్ణువుకు వాహనమైన గరుత్మంతుడికి ప్రీతికరమైన రోజు. కలియుగ వైకుంఠంగా ప్రసిద్ధి చెందిన తిరుమలక్షేత్రంలో ఈనాడు విశేష పూజలు జరుగుతాయి.

తిరుమలకు గరుత్మంతుడికి విడదీయరాని సంబంధం ఉంది. తిరుమల సప్తగిరులతో కూడిన క్షేత్రం. సప్తగిరుల పేర్లలో 'గరుడాచలం' లేదా 'గరుడాద్రి' అనేది ఒకటి. తిరుమల కొండ గరుడాకారంలో ఉండడం వల్ల 'గరుడాద్రి' అనే పేరు ఏర్పడినట్లు కథనం. కాగా, త్రేతా యుగంలో ఈ క్షేత్రానికి 'గరుడాద్రి' అనే పేరు ప్రధానంగా ఉండేదని వామన పురాణంలో పేర్కొనబడింది. అంతేకాకుండా, వైకుంఠంలోని 'వేంకటము' అనే విష్ణుదేవుడి క్రీడాపర్వతాన్ని వరాహవిష్ణుమూర్తి ఆజ్ఞమేరకు గరుత్మంతుడు భూమికి తీసుకుని వచ్చి స్వర్ణముఖీనది ఉత్తరతీరంలో ప్రతిష్ఠింప జేశాడు. కనుక, దీనికి 'గరుడాద్రి' అనే పేరు ఏర్పడిందని మార్కండేయ పురాణకథనం. అటువంటి తిరుమల కొండపైన కొలువుదీరిన కలియుగప్రత్యక్ష దైవం శ్రీవేంకటేశ్వరస్వామి వారికి గరుత్మంతుడు వాహనంగా, ధ్వజంగా నిత్యంసేవలు అందిస్తూ ఉన్నాడు.



తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయంలోని గంటామండపంలో ఆనందనిలయంలోని మూలవిరాట్టుకు ఎదురుగా గరుడాళ్వారు నమస్కారభంగిమలో కొలువుదీరి ఉన్నాడు. అలాగే, తిరుమలకు వెళ్ళే మార్గం ప్రారంభం అలిపిరి వద్ద శ్రీగరుత్మంతుడి భారీవిగ్రహం శోభాయమానంగా దర్శనమిస్తూ.... "మీ విన్నపాలు శ్రీనివాసునికి విన్నవించేందుకే నేను ఇక్కడ ఉన్నాను" అన్నట్లుగా కొలువుదీరి ఉన్నాడు.

స్వామివారికి జరిగే వాహనసేవలలో గరుడవాహనసేవ ప్రత్యేకమైనది. అపురూపమైనది. బ్రహ్మోత్సవాలలో ఐదవరోజు రాత్రి జరిగే గరుడవాహనసేవను దర్శించేందుకు లక్షలాదిమంది తహతహలాడుతారు. అంతేకాకుండా, ప్రతినెలా పున్నమి రోజు రాత్రి గరుడవాహనారుఢుడై స్వామి తిరుమాఢవీథులలో ఊరేగుతూ భక్తులపై కరుణ కురిపిస్తాడు. గరుడసేవను చూసి సామాన్య జనం పులకించి.... జన్మతరించిందని భావించడమే కాదు..... ఆళ్వారులు, సంకీర్తనాచార్యులు సైతం పులకించి స్వామివారిని కీర్తించారు.

గరుడుడిపైన శ్రీమన్నారాయణుణ్ణి దర్శించి 'పెరియాళ్వారు', 'పల్లాండు... పల్లాండు' అని మంగళాశాసనం చేయగా,

**"గరుడగమనరారా నన్ను నీ కరుణ నేలుకోరా..."** – అని భక్తరామదాసు కీర్తించాడు.

**"దాసవర్గములకెల్లా దరిదాపు మీరేకాన**
**వాసికి నెక్కించరాదా వసుధలో మమ్మును**
**ఆయితమై గరుడుండ! అట్టే మీరు చేయరాదా**
**యేయెడ విన్నపము మాకేమి వలసినాను"**

*జూలై, 28న*
*గరుడపంచమి సందర్భంగా..*

– అని తాళ్లపాక అన్నమయ్య భక్తులకొరకు శ్రీవేంకటేశ్వరస్వామికి విన్నపం చేయమని గరుడుణ్ణి కోరాడు. ఈ విధంగా తిరుమలలో విడదీయరాని బంధం కలిగిన గరుత్మంతుడికి గరుడపంచమి సందర్భంగా ప్రత్యేక పూజలను నిర్వహిస్తారు. సాయంత్రం శ్రీమలయప్పస్వామివారిని గరుడ వాహనంపై ఆశీనులను చేసి మాఢవీధులలో గరుడవాహనసేవను నిర్వహిస్తారు.

## గరుడ పంచమి వ్రతం

గరుత్మంతుడు వేదస్వరూపుడు. వేదమయుడైన గరుత్మంతుడి పేరు మీద వ్రతం అమలులోనికి రావడం వెనుక ఆసక్తికరమైన గాథ ఉంది. కాశ్యపమహర్షికి వినత, కద్రువ అని ఇద్దరు భార్యలు. వినత పుత్రుడు 'గరుత్మంతుడు'. కద్రువ సంతానం సర్పరాజులు. ఒకసారి వినత, కద్రువల మధ్య పోటి ఏర్పడి ఓడిపోయిన వారు గెలిచినవారికి జీవితాంతం దాస్యం చేయాలనే ఒప్పందం కుదిరింది. వినత ఓడిపోయి కద్రువకు దాసిగా మారి సేవలు చేయసాగింది. అపరపరాక్రమవంతుడైన గరుత్మంతుడు తల్లి దాస్యాన్ని తొలగించేందుకు అనేక రకాలుగా అన్వేషించాడు. చివరకు నారదుడి సలహా మేరకు స్వర్గలోకమునకు వెళ్ళి ఇంద్రుడి వద్ద నుండి అమృతాన్ని తీసుకుని వస్తే తల్లిదాస్యం తొలగుతుందని తెలుసుకుని స్వర్గలోకం చేరాడు. అమృతం తీసుకువెళ్ళేందుకు ప్రయత్నించగా, అడ్డుకున్న ఇంద్రుడితో సహా దేవతలందరినీ అణచివేసి అమృతాన్ని తీసుకుని వచ్చి తన సవతి తల్లికి ఇచ్చాడు. కద్రువ అమృతాన్ని తీసుకుని వినతకు దాస్య విముక్తం గావించింది. ఈ విధంగా స్వర్గంనుంచి అమృతాన్ని తీసుకుని వచ్చి తల్లికి దాస్యవిముక్తం గావించిన రోజే "శ్రావణశుక్ల పంచమి" అని, అంతేకాకుండా గరుత్మంతుడు జన్మించిన రోజు కూడా అదేననీ...... అందుకు గరుత్మంతుడి ప్రీత్యర్థం వ్రతం చేయడం ఆచారమైనట్లు శాస్త్ర వచనం.

ఓం తత్పురుషాయ విద్మహే
సువర్ణపక్షాయ ధీమహీ
తన్నో గరుడః ప్రచోదయాత్॥

సత్సంతాన ప్రాప్తికి, నాగదోషనివారణకు గరుడదేవత పూజ విశిష్టమైనదని ఆగమగ్రంథాలు ఉపదేశిస్తున్నాయి. అట్టి గరుత్మంతుడు మాకు మంచి జ్ఞానాన్ని ప్రసాదించు గాక!

ఆపదలయందు ధైర్యం,
సంపదలున్నపుడు ఓర్పు,
సభలలో వాక్చాతుర్యం, యుద్ధంలో పరాక్రమం,
కీర్తి సంపాదించుటలో ఆసక్తి,
విద్యలయందు ఆసక్తి -
ఈ గుణాలు మహాత్ములకు
ప్రకృతి సహజములు

ఈ వ్రతాన్ని సుమంగళి అయిన మహిళలు, ముఖ్యంగా అన్నదమ్ములు ఉన్న స్త్రీలందరూ ఆచరించవలెను. పూజా మందిరంలోని పీఠంపై బియ్యపుపిండితో ముగ్గులు వేసి, బియ్యం పోసి, దానిపైన బంగారు, వెండి లేదా మట్టితో చేసిన ఆదిశేషుడి ప్రతిమను ఏర్పాటు చేసుకొన వలెను. ఆదిశేషుడి పడగల క్రింద పసుపుతో చేసిన గౌరీదేవిని ప్రతిష్ఠించుకుని ముందుగా వినాయకుణ్ణి, తర్వాత ఫణి గౌరీ దేవిని పూజించి, నైవేద్యంను సమర్పించవలెను. తోరమును తయారు చేసుకుని –

ఫణిగౌరీ నమోస్తుతే కైలాసనిలయే స్థితే।
లోకమాతర్నమస్తుభ్యం సౌభాగ్యం దేహి మే సదా॥

అనే శ్లోకాన్ని పఠించి ధరించవలెను. తర్వాత వ్రతకథను పఠించి నమస్కరించి వ్రతాన్ని ముగించవలెను. తర్వాత ముత్తైదువులకు వాయన తాంబూలాలను ఇచ్చి ఆశీర్వాదాలను పొందవలెను. ఈ విధంగా గరుడపంచమి వ్రతాన్ని ఆచరించడం వల్ల అటు పుట్టినింటికీ... ఇటు మెట్టినింటికీ సకలసౌభాగ్యాలు కలుగడంతో పాటు స్త్రీల సౌభాగ్యం కలకాలం వర్ధిల్లుతుంది.

వ్రతాచరణను పరిశీలిస్తే–పేరు గరుత్మంతుడిది. కానీ, పూజమాత్రం ఆదిశేషుడికి. వాస్తవానికి గరుత్మంతుడికి సర్పరాజుకు మధ్య శత్రుత్వం ఉంది. అయితే గరుడపంచమినాడు ఆదిశేషుడిని పూజించడం అంటే శత్రువును పూజించడం అనేది– అందరినీ సమానంగా ఒకే దృష్టితో చూడమనీ, అందరిలోనూ మంచిని గ్రహించమని చెప్పే రహస్యాన్ని ఈ వ్రతంచాటి చెప్తూ ఉంది.







*(గతసంచిక తరువాయి భాగం...)*

మధురలో వల్లభరాయనికొలువులో పరతత్త్వనిర్ణయంలో తన వాదనలు విని పించి ఆ మహారాజు సత్కారాలంది విష్ణు చిత్తుడు శ్రీవిల్లిపుత్తూరు చేరాడు.

యథాప్రకారం వనరక్షణలో, సుమ సేకరణలో, వటపత్రశాయి కైంకర్యంలో మునిగిపోయాడు. ఒకరోజు విష్ణుచిత్తుడు తులసీవనంలో పాదులకోసం గుంతలు త్రవ్వుతుంటే ఒక బాలిక కనబడింది.

ఆ శిశువు గారుడవర్ణంతో భూమాత అంశంగా గోచరించింది. ఆ బిడ్డ అంద చందాలు మాటల్లో వర్ణించడం అసాధ్యం. ఆ పాప శృంగారరాశి. వనలక్ష్మి. విదియ చంద్రభాసమాన. ఆ బిడ్డను చూడగానే విష్ణుచిత్తుడు పరవశించాడు.

ఆహా! తులసీవనంలో కనబడ్డ శిశువు. సాక్షాత్ జానకీబాల అంటూ మురిసి పోతుంటే అశరీరవాణి వినిపించింది.

"నాగేటిచాటున సీత జనించినట్లు సాక్షాత్ ధరణీదేవి బాలికగా నీ కంట బడింది. ఈ బాలికావతరణకు కారణం కూడా లేకపోలేదు. వరాహావతారంలో శ్రీమహావిష్ణువు భూమిని ఉద్ధరించాడు. భూమాతను అనురాగంతో ఆలింగనం చేసుకొన్నాడు. ఆ సందర్భంలో భూదేవి శ్రీహరితో 'స్వామీ! నీ కిష్టులెవరు? మీకు సంప్రీతికరమైన పూజ ఏది? అని ప్రశ్నిం చింది. అపుడు శ్రీనాథుడు –

'చంద్రవదనా! చెబుతాను. నన్ను పొగిడేవారు, పూలమాలికలు సమర్పించే వారు నాకు ఇష్టులు. ఆలాంటి వారికి అనూహ్యమైన సంపదలు ప్రసాదిస్తాను. వారిని సదా సంరక్షిస్తాను' అన్నాడు. తన పతినోట వచ్చిన మాట సార్థకం కావాలని ఈ భూలోకంలో జన్మించి స్వామిని సేవించాలని తానే బాలికగా భూదేవి జన్మించింది. సీతమ్మకు తండ్రిలాగ ఈ తులసీవనజాతకు నీవే జనకుడివి. ఈ బిడ్డను ఇంటికి తీసుకువెళ్ళి పెంచుకో. సకల సిద్ధులు సమకూరుతాయి" అన్నది.

విష్ణుచిత్తులవారు అశరీరవాణి ఆదేశించినట్లు తన ఇల్లాలి చేతికి బిడ్డని చ్చాడు. అశరీరవాణి ఆదేశం కూడ చెప్పాడు. అపుడు దేవదుందుభులు మ్రోగాయి. పూలవానలు కురిశాయి. కిన్నెరలు కీర్తించారు. అచ్చరలు నాట్యమాడారు. స్వర్లోక వాసులు జయము జయము అన్నారు. సనకసనందనాది సన్మునులు సకలశోభనవ స్తుతితో వచ్చి భట్టనాథుని ప్రశంసించారు. విష్ణుచిత్తుడు ఆనందోత్సాహంతో 'నందనో త్సవం' చేశాడు. తనకు దక్కిన బిడ్డకు 'గోదా' అని నామకరణం చేశాడు. ఆ తల్లి హస్తరేఖలు చూచి జగదీశ్వరుని పట్టపురాణి అవుతుందని చెప్పాడు. విష్ణుచిత్తుని ఇంట బాలిక క్రమంగా పెరుగసాగింది. తన వయస్సువారలతో, చెలికత్తెలతో బొమ్మలాటలాడేది.

'రెండుబొమ్మలు తెచ్చి ఒకటేమో హరి. రెండవది వైదర్భి. నేను పెళ్ళికూతుర్ని. మీరంతా పెండ్లికొడుకుల వారు' అని స్వయంవర సన్నాహాలు చేసేది. చెలికత్తెలు పెళ్ళికొడుకు పేరు చెప్పమంటే గోద 'వటపత్రశాయి' నా మగడనేది.



గోద బాలికావస్థదాటి జవ్వని అయింది. ఆ గోద మనస్తత్వంలో మార్పేమి కనబడలేదు.

భట్టనాథులు ఉద్యానవనంనుండి పూలు తెచ్చేవారు. అందంగా మాలికలు కూర్చేవారు. వటపత్రశాయి కోసం ఒక బుట్టలో ఉంచి వెళ్ళేవారు.

గోదాదేవి ఈ దృశ్యమంతా చూచింది.

వటపత్రశాయికి అర్పించాలనుకొన్న పూలు తన కొప్పులో ముడుస్తుంది. తన అలంకరణ బాగుందా అని నడ బావిలో చూచుకొంటుంది.

ఆ తరువాత కొప్పుకుచుట్టిన సుమదామాన్ని జాగ్రత్తగా పూలసెజ్జలో పెడుతుంది. విష్ణుచిత్తుల వారు యథాప్రకారం వాటిని వటపత్రశాయికి అర్పించేవారు. స్వామివారు తెగ సంతోషించేవాడు.



'విష్ణుచిత్తా! ఈ దండలే నా కిష్టం. లేనిపోని కల్పనల తోడి దేవతల స్తోత్రాల కంటె, కానుకాదుల కంటె ఈ పూలే నాకు ప్రీతి' అని సెలవిస్తే విష్ణుచిత్తుడు సంబరపడేవాడు.

ఇదే విధంగా చాలరోజులు గడిచాయి. వటపత్రశాయికోసం బుట్టలో పూలమాలలు ఉంచడం విష్ణుచిత్తుల వంతైతే, వాటిని కొప్పులో ముడవడం, అలంకరించుకోవడం, నడబావిలో చూచి సంతోషపడడం, మరల ఆ సుమహారాలను గోద పూలబుట్టలో పెట్టడం యథాతథంగా గుట్టుచప్పుడు గాకుండా సాగిపోతూ ఉంది. అంతమాత్రమేకాదు. గోద తన తండ్రితోబాటు నందనవనంలో పూవులు కోసేది. చిత్రచిత్రంగా హారాలు కూర్చేది. తాను ముడుచుకున్న పూలమాలను తండ్రి ద్వారా పంపేది.

ఈ విధంగా కొన్ని రోజులు గడిచాయి.

ఒక రోజు మునుపటిలాగా గోదాదేవి వట పత్రశాయి కోసం సిద్ధంచేసిన పూదండను తాను కొప్పులో ముడుచుకొని నడబావిలో చూచి సంబర పడుతుంటే విష్ణుచిత్తుడు చూశాడు.

విష్ణుచిత్తుడు పరమ సాత్త్వికుడు. ప్రత్యేకించి ఆతనికి సుతావ్యామోహం ఎక్కువ. అంచేత తాను బాధపడినా–

'తల్లీ! వటపత్రశాయి కోసం సంసిద్ధం చేసిన సరాలు వాడుకోవడం తగదమ్మా' అంటూ ఆ సరాలు అక్కడే వదలి తోటలో మరికొన్ని పూలుకోసి ఆ రోజు స్వామి కర్పించాడు. కాని గోవిందుడు స్వీకరించలేదు.

చిన్నికన్నె ముడుచుకొన్న సుమదామాలే కావాలన్నాడు.

కన్యకామణి వెంట్రుకల సువాసనతోడి పూలే కావాలన్నాడు. ఆలా చేస్తేగాని వాటిని స్వీకరిస్తా నన్నాడు. విష్ణుచిత్తుడు ఆలాగే గోదాదేవితో గుడికి వెళ్ళాడు. పూల హారాలు సమర్పించాడు.

'స్వామీ! ఇవే గోదా ముడిచి ఇచ్చిన పూలు' అని అర్పించాడు. స్వామి సంతోషంతో ఎదమీద ఆ దండలను చేర్చుకొన్నాడు. కన్నుల ఒత్తుకొన్నాడు. తలమీదికి చుట్టుకున్నాడు.

'విష్ణుచిత్తా! నేనే ఆమెను పెండ్లాడుతాను' అని, 'గోదను నీవు జాగ్రత్తగా నీతో వెంటపెట్టుకొని వెళ్ళు' అని ఆజ్ఞ ఇచ్చాడు.

ఆనాటినుండి గోదాదేవికి 'చూడికొడుత్త నాచ్చియార్' అనే పేరు వ్యాప్తిలోకి వచ్చింది.

గోదాదేవి పరిపూర్ణయువతి అయింది. అయినా ఆవిడలో మార్పులేదు. ఎపుడూ గోవిందుడి మీద ఆసక్తే. అంచేత తండ్రి వటపత్రశాయికి పుష్పకైంకర్యంచేసి ఇంటికి రాగానే దగ్గర కూర్చొని ఉపచారాలు చేసేది.

ఒక రోజు అలా ఉపచారాలు చేస్తూ –

'తండ్రీ! కమలాక్షుని కథలన్నీ తెలిసినవాడివి. అర్చావతారమూర్తుల ఆలయాలు ఈ లోకంలో ఎక్కడెక్కడున్నాయి? లెక్కలేనన్ని దివ్యదేశాలలో మీకు తెలిసినవి ఎన్ని? నాకు స్పష్టంగా చెప్పరా!' అని అడిగింది గోముగా.

'అమ్మా! చెబుతాను. మాధవుని మందిరాల కథలు చెబుతాను. అంతేకాదు స్వామి కథలుకూడా నీకు వివరిస్తాను. 108 దివ్యతిరుపతులు ప్రసిద్ధక్షేత్రాలు. ఈ క్షేత్రకథలు, అర్చావతారమూర్తుల విశేషాలు వినేవారికి మోక్షం కరతలామలకం' అంటూ నిచుళాది 108 దివ్యదేశాలలోని అర్చామూర్తుల విశేషాలు విశదం చేశాడు.

చివరగా తిరువరంగం అనబడే శ్రీరంగధామంలో శ్రీరంగనాథుడు శ్రీరంగనాయకి తాయార్లతో ఉభయకావేరుల మధ్య– 'అమ్మా! బ్రహ్మకు ప్రత్యక్షమైనవాడు, ఆదిశేషునిపై శయనించినవాడు, చంద్రపుష్కరిణి సమీపంలో కస్తూరీతిలకుడై, జగత్కల్యాణమూర్తియై దర్శనీయుడుగా శ్రీరంగనాథుడున్నాడమ్మా' అని విష్ణుచిత్తులవారు వర్ణిస్తుంటే గోదాదేవి తన్మయురాలయి, పరమమౌనిలాగా పరచింతలు వదలిపెట్టి, ఆనందానుభూతిలో తేలియాడింది.

(ఇంకా ఉంది)

**గడచిపోయిన దాన్ని గురించి**
**ఊరికే ఆలోచించకూడదు.**
**జరగబోవుదాన్ని గురించి**
**ఆశాసౌధములు కడుతూ కూర్చోకూడదు.**
**విచక్షణ జ్ఞానం గలవారు వర్తమానంలో**
**నివసిస్తూ అప్పుడు చేయవలసిన**
**పనులనే ఆచరిస్తారు.**




అదిగదిగో కురుపాండవ యుద్ధరంగము
ధర్మస్థాపన కొరకై కురుక్షేత్రము

గురువులు తాతలు తండ్రులు అన్నదమ్ములు
మరణించుటకై వచ్చిన బంధుమిత్రులు
చూచి నంత అర్జునుండు ఖిన్నుడయ్యెను
మోహములో మునిగి అస్త్రములను వీడెను

ఆత్మకు మరణము లేదు దేహము నిలవదు
సుఖములకు దుఃఖములకు చావులకు పుట్టుకలకు
అతీతముగ మెలగాలని స్థితప్రజ్ఞుడు కావాలని
చిరునగవుల శ్రీకృష్ణుడు నరునిజూచి బోధజేసె

సంగత్వము లేక చేయు కర్మలే కర్మములు
భగవంతుని కర్పించిన ఫలములే ఫలములు
స్వధర్మమును పాటించిన నరులే నరులు
అని పలికెను గోవిందుడు ఆలకించె ధనంజయుడు

జీవరాసులెల్ల పరమాత్మ అంశలని ఎంచి
జ్ఞాన ఖడ్గమును ధరించి సంశయములను ద్రుంచి
కర్మ ఫలములను దహించి కార్యోన్ముఖుడవ్వాలని
దేవ దేవుడన్నాడు వినెను విజయుడు

స్థిరమైన భక్తిలో కర్మలాచరించవలయు
నిత్య సన్యాసియై సమదృష్టితో మెలగవలయు
అందరికి ప్రియుడై పరమశాంతి పొందవలయు
అని తెలిపెను భగవంతుడు తలవూచెను భక్తుడు

ధ్యాన యోగము మనసుకు శుద్ధి కార్యము
విమల బుద్ధితో చేయుము ఆత్మారాధనము
సాధనతో సమకూరును పరమోత్తమ పథము
అని పలికెను జనార్దనుడు వినెను విజయుడు

– డా॥ జి.సుబ్రహ్మణ్యం రెడ్డి

# వైఖానసము - విశిష్టత

- ఆచార్య వేదాంతం శ్రీ విష్ణుభట్టాచార్య

**శ్రౌతస్మార్తాదికం కర్మ నిఖిలం యేన సూత్రితమ్ ।**
**తస్మై సమస్త వేదార్థవిదే విఖనసే నమః ॥**

భగవంతుని ఉచ్ఛ్వాస నిశ్వాసములైన వేదాలు ప్రధానంగా భగవత్ప్రాప్తికి దోహదాలు. అవి ఋుక్యజుస్సామా థర్వణాలని నాలుగు విధాలు. ఇందు ఒక్కొక్కటి సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషత్తులని వర్గీకరించబడినవి. అందలి సంహితలు మూలమంత్రములు. వీటిని ఆధారం చేసుకొనే కర్మ ప్రతిపాదితాలు అయిన కల్పసూత్రాలు, యాగప్రతిపాదితాలైన జైమిన్యాది శాస్త్రాలు ఆవిర్భవించాయి. కల్పసూత్రములలో మానవుడు జన్మించింది మొదలు మరణాంతం వరకు ఏ ఏ సమయమున ఏ ఏ కర్మలను ఆచరించాలని విధి నిబంధన వాక్యాలు తత్తన్మంత్ర ప్రయోగ విధానాలు ప్రతిపాదితాలు. ఒక్కొక్క వేదానికి అనేకాలైన కల్పసూత్రాలు రచించారు. వేద వాఙ్మయం దానిని స్పష్టపరచింది. దానిని పరిశీలించిన కృష్ణ యజుర్వేదానికి సంబంధించిందే 'వైఖానస కల్పసూత్రం' అని శౌనకుడు తన చరణ వ్యూహంలో నిర్దేశించాడు. ఆ వైఖానస కల్పసూత్ర కర్త 'విఖనసుడు'– ఆ విఖనసుడే మహర్షి అని, చతుర్ముఖ బ్రహ్మ అని ఆయా సంహితలలో చెప్పబడింది. విఖనా, విఖన, విఖనస అనేవి ఆ మహర్షి నామాంతరాలు. శ్రీమన్నారాయణుడు తననర్చించుటకు ఈ ముని పుంగవుని బ్రహ్మచే సృజింప చేసుకొన్నట్లు నామ వ్యుత్పత్తి. ఇది ఆయా అధికారాలలో వివరించబడింది.

ఆ విఖనసముని ప్రణీత కల్పసూత్రం 'వైఖానస ఆగమ శాస్త్రాని'కి మూలభూతం అనీ, ఆ ఆగమం వైదికమనీ, కల్పోక్త వానప్రస్థాశ్రమ విధానం సర్వమహర్షి సమ్మతం అనీ ఆయా ప్రామాణికుల భావన.

విఖనస మహర్షి తనకల్పసూత్రంలో విష్ణ్వర్చనా విధానాన్ని షోడశోపచారాలతో వివ రించి, ఆ విధంగా ఆచరించిన విష్ణుపదము ప్రవేశిస్తారని వివరించాడు. దానిని ప్రధానంగా గ్రహించిన భృగు, మరీచి, అత్రి, కశ్యపులు కర్షణం నుండి ప్రతిష్ఠ, అర్చన, స్నపన, ఉత్సవ, ప్రాయశ్చిత్త విశేష అర్చనాదులనేకాక, దుర్భిక్ష, అనావృష్టి, పరచక్రభయాది ఉపద్రవ సమయాలలో చేయవల సిన విధివిధానాలు అధికార సంహిత తంత్రకాండలనే వారి వారి ఆగమగ్రంథాలలో చక్కగా వివరించారు.

వైఖానస కల్పసూత్రాల్లోని స్మార్త సూత్రం చతుర్థ ప్రశ్నలో, దశమఖండం ఆరంభంగా ద్వాదశఖండంవరకు గల ఇరువది ఏడు సూత్రాలలో ప్రతిష్ఠాపూర్వ అర్చనావిధి సంగ్ర హంగా తెలియజేశారు. అందులో **"అతో దేవాదినా ఇతి దేవం ప్రణమ్య"** అని ప్రారంభించి **"ప్రణామం కుర్యాత్"** అనేంతవరకు గల ఏడు సూత్రాలలో చెప్పబడిన అర్చనావిధిని పరిశీలించగా ఆవాహన, ఉద్వాసనలు లేక ఉపచారాల సంఖ్య పదహారుగా నిర్ణయించారు. దీనిని ఆధారంగా చేసుకొని ఆగమసంహితలలో కూడా ఉపచారాలకు ఆదిలో ప్రధానంగా ఆవాహనం, అంత్యంలో ఉద్వాసనం సామాన్యంగా స్వీకరించాలని సూచింప బడింది. ఉపచారాల సంఖ్యను నిర్దిష్టముగా చెప్పలేదు. ఈ ప్రమాణాన్ని బట్టి కల్ప ఆగమాల జన్యజనక సంబంధం అవగతం.

కల్పసూత్రంలో చెప్పిన గ్రహశాంతి విధానానికి ప్రతీకగా ఆగమంలో అద్భుత శాంతి వివరింపబడింది. అందు లోని ప్రధాన దేవతలు నవగ్రహములు. ఈ గ్రహస్థానములు పరిశీలింప కల్పసూత్రాలలో చెప్పిన విధానమే ఆగమాలలో కూడా నిర్ణయించబడింది.

**జూలై, 11న శ్రీవిఖనసాచార్యుల శాత్తుమొర సందర్భంగా..**

## ఆరాధనం వైదికం

వైఖానస కల్పసూత్రాలలో అష్టమప్రశ్నలో గృహస్థ భేదాన్ని వర్ణించు సందర్భంలో ఒక సూత్రం చెప్పబడింది. దానిలో ప్రతినిత్యం పంచ మహాయజ్ఞాలను ఆచరించి, ఆయా కాలాల్లో





సప్తపాకయజ్ఞాలను, పక్షపర్వాల్లో దర్శపూర్ణమాసాన్ని, ప్రతి నాలుగు మాసాలకు చాతుర్మాసాన్ని, ప్రతి ఆరుమాసాలకు పశు బంధం, ప్రతిసంవత్సరం సోమయాగం విధిగా గృహస్థుడు ఆచ రించాలని చెప్పబడింది (9-5-40), ఇదియే అమూర్తారాధనం. ఈ చెప్పబడిన దానిని దృష్టిలో ఉంచుకొని ఆగమశాస్త్రంలో అగ్ని ఆధానానికి ప్రతీకగా విగ్రహప్రతిష్ఠ, పంచమహాయజ్ఞాల ప్రతీకగా పంచబేరార్చన, దర్శపూర్ణమాసాలకు ప్రతీకగా పక్షో త్సవం, చాతుర్మాస్యాల స్థానంలో విశేషపూజలు, సోమయాగానికి ప్రతీకగా బ్రహ్మోత్సవం (కాలోత్సవం) అని వర్ణింపబడింది (సమూర్తార్చనాధికరణం 27, 1-5) ఈ అంశాలతో వైఖాన సారాధనం వైదికమని నిర్ధారింపబడుతున్నది.

## క్లేశవిరహము

*"ప్రవః పాన్థమంధసో ధియాయతే మహే శూరాయ విష్ణవే చార్చత"* అనెడి ఋగ్వేదమంత్రంలో *"విష్ణవేచార్చత"* అను మంత్రాన్ని బట్టి అర్చనావిధానానికి వేదమెంత ప్రాముఖ్యత ఇచ్చి ఉందో అనే విషయం తెలియజేయుటకు ఈ మంత్రమును ప్రతిపాదించి, ఆ పైన అర్ఘ్యాదులతో పురుషసూక్త మంత్రాలతో పూజిస్తే విష్ణుపద ప్రాప్తి కలుగుతుందని చెప్పడమే కాక అర్చనా విధానానికి శ్రుతిమూలకత్వం కూడా మరీచిసంహితలో వర్ణింప బడింది. అదేవిధంగా అమూర్తం అనగా అగ్నిలో హోమం చేయడం అని, మూర్తి బింబాన్ని పూజించడమే సమూర్తమని, ఇదే శ్రేష్ఠం అని వివరింపబడింది. ప్రతిష్ఠావిధానంలో సర్వవ్యాప కుడైన పరమాత్మకు ఆవాహన ఉద్వాసనలు అయుక్తం అని, అయిననూ అరణ్యవ్యాప్తమైన వహ్ని మథించటంతో, సన్నిహిత మైన ధ్యానమథనముతో, భక్తునకు విష్ణువు సన్నిహితుడు అవుతాడని వివరించి భక్తసౌలభ్యం కొరకై ఆవాహన క్రమం వివరంగా చెప్పారు. పరమాత్ముని ఉత్సవ విధానంలో శక్తి కొలదిచేయు వాహనసేవలను గ్రామంలో ప్రజలు సేవించిన వారికి పదే పదే యజ్ఞఫలం లభిస్తుందని ఇది భృగ్వాదుల అభిప్రాయం అని మరీచి తన సంహితలోనే తెలిపాడు. దీనిని పరిశీలిస్తే ఈ ఆగమశాస్త్రానికి ఇందులోని సంహితాన్తరములతో భృగు-మరీచి-అత్రి-కశ్యపుల ఒక్కొక్కరి గ్రంథాలతో వేరే ఒకరి గ్రంథాలతో వివాదం లేదని *"అనుక్త మన్యతో గ్రాహ్యం"* అనే న్యాయంగా ఒక గ్రంథంలో చెప్పని విషయం వేరే గ్రంథంనుండి గ్రహింపవచ్చని తెలిస్తున్నది. కనుక ఈ వైఖానస ఆగమశాస్త్రం 'క్లేశవిరహం - సర్వజన సమ్మతం గౌరవాస్పదం' అనడంలో సందేహం లేదు.



## వానప్రస్థాశ్రమ విధి

మానవుని ఆచరణధర్మాలనుబట్టి ఆశ్రమ ధర్మాలు నాలుగు విధాలుగా వైఖానస కల్ప సూత్రంలో వర్ణింపబడింది. అవి బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్యాసం అనేవి. ఉపనయనమైంది మొదలు గురుశుశ్రూషచే ఆయా ధర్మాలు ఆచరిస్తూ పన్నెండు సంవత్సరాలు కానీ, ఇరవై సంవత్సరాలు కానీ గురుకులంలో వేదాధ్యయనం చేస్తే 'బ్రహ్మచర్య'మని అంటారు. పాణిగ్రహణ ప్రభృతి పత్నితో యజ్ఞయాగాలను ఆచరిస్తూ, పుత్రపౌత్రాది సంతానానికి దోహదభూతమౌతూ

ఆయా ధర్మాలను ఆచరించుట 'గార్హస్థ్య'మని అంటారు. తృతీయాశ్రమ ధర్మమే వానప్రస్థం. గృహస్థుడు పుత్రపౌత్రాది సంతానాన్ని చూచి సర్వసుఖాలు అనుభవించి, వారిని త్యజించి, వనంలో ప్రవేశించి అక్కడ ఆయా ధర్మాలను ఆచరించడమే 'వానప్రస్థం' అని అంటారు. తురీయాశ్రమమే 'సన్యాసాశ్రమం'. ఇక్కడ సుఖదుఃఖాలు లేకుండా అద్వైతభావంతో సమదృష్టి వహించి భిక్షాచరణతో కాలం గడుపుతూ పరమాత్మ సంయోగం కోసం ఎదురుచూసే విధానం వర్ణింపబడినది.

## ఉత్కృష్టత

పైన తెల్పిన నాల్గు ఆశ్రమధర్మాల్లో వానప్రస్థాశ్రమ ధర్మం వైఖానస కల్పసూత్రంలో సర్వసమ్మతంగా వర్ణింపబడింది. ఏ విధంగా అంటే– కలిసి పత్నితో వానప్రస్థాశ్రమం స్వీకరించ వచ్చని ఆనుషంగికంగా తెలుపబడినది. వనంలో భార్యలేక దర్భ శయ్యలో శయనించి జితేంద్రియుడై ఉండాలని నిర్దేశింపబడింది. (ఇద్దరూ బ్రహ్మచర్య ధర్మాలే అవలంబించాలన్న మాట).

"శ్రామణక"మనే అగ్నికుండం నిర్మించి అందు ఔపా సన విధానంతో హోమం చేయాలని స్వయంగా ఆయాకాలాలో పక్వమైన ఫలాలనుగానీ, ఆకులనుగానీ భుజించి ఉత్తరోత్తరంగా తపస్సంయోగం అధికంచేసి విశిష్టమైన ఫలం కోసం పరితపిం చడమే ప్రధానంగా ఈ వానప్రస్థాశ్రమ ధర్మంలో నిర్ణయింప బడింది. ఈ కల్పసూత్రం మాత్రమే ఈ ఆశ్రమధర్మాన్ని గూర్చి విపులంగా వివరించడం వల్ల ఆశ్రమం 'వైఖానసమ'ని ప్రసిద్ధి పొందింది.

ఇట్లు వర్ణించడం వల్ల తృతీయాశ్రమం ప్రవేశింపదల చిన అందరూ ఈ కల్పోక్త ఆశ్రమధర్మాలే అవలంబించాలని మనువు తన స్మృతి గ్రంథంలో ప్రకటించాడు. బోధాయనుడు తన ధర్మసూత్రంలో కూడా వానప్రస్థాశ్రమ ధర్మాలను వివరిస్తూ పైవిషయాలనే నిర్ధారించాడు. ఇదికాక గౌతమధర్మ సూత్రాలలో వానప్రస్థ ధర్మవిభాగంలో *"శ్రామణకే నాగ్ని మాధాయ"* (1–3–26) అంటూ వానప్రస్థుడంటే వైఖానసుడే అని గౌతముడు తన అభిప్రాయాన్ని ఘంటాపథంగా తెల్పినాడు.

ఈ విధంగా సర్వమహర్షిప్రోక్త ధర్మాలలో కూడా ఇందులోని తృతీయాశ్రమ విధానం ప్రస్తుతింపబడి తన ఉత్కృ ష్టతను నిరూపించుకుంది. దీనికి మూలమే మన వానప్రస్థాశ్రమ ధర్మవిషయమని అందరూ గుర్తింపకపోవడం, కావున తృతీయా శ్రమమైన వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించు వారందరూ ఇందులో చెప్పిన ధర్మాలను ఆచరిస్తే కల్పోక్త ఫలాన్ని పొంది ధన్యులౌవు తారు.

కాబట్టి విఖనసునిచే రచించిన కల్ప సూత్రం వైఖానస ఆగమశాస్త్రానికి మూలభూతమైనదనీ, ఆ ఆగమశాస్త్రోక్త ఆరాధన వైదికమనీ, భృగు మరీచి అత్రి కశ్యపుల ఆగమ సంహితలు క్లేశవిరహములనీ, కల్పోక్త తృతీయాశ్రమం సర్వ మహర్షి సమ్మతం ఎట్లైనదో అనే అంశాలు సంగ్రహంగా నిరూపించారు. కల్పసూత్ర ప్రణీత అయిన విఖనసుడు సాక్షాత్తు వైకుంఠవాసుడు అయిన శ్రీమహావిష్ణువుకు అర్చనాదులు జరిపి నట్లు పురాణవచనం. అందువల్ల ఆనాటినుండి నేటివరకు అర్చా స్వరూపుడైన శ్రీశ్రీనివాసునికి అర్చనాద్యుత్సవ కైంకర్యాలు వైఖాన సాగమోక్తంగనే జరుగుతున్నాయి. ఇది నిర్వివాదాంశము. ఇంతటి వైభవోపేతమైన విశిష్టత సంతరించుకొన్న వైఖానసాన్ని (కల్ప, ఆగమాలను) అధ్యయనం చేసి చక్కటిఫలాన్ని పొందడం మనందరి కర్తవ్యం.



**భుజకీర్తులూ,చంద్రహారాలూ,**
**స్నానమూ, పైపూతలూ, పూలూ,**
**అందంగా అలంకరించుకొన్న శిరోజాలు -**
**ఇలాంటి వేవీ మానవుడికి**
**శోభ కలిగించలేవు.**

**శాస్త్రసంస్కారం కల 'వాక్కు' ఒక్కటే**
**అతడికి శోభ చేకూరుస్తుంది.**
**పైన చెప్పిన సువర్ణాభరణాదులు**
**అన్నీ నశించిపోయేవే.**

**వాక్కు అనే భూషణ మొక్కటే**
**శాశ్వతంగా నిలిచే భూషణం.**





# పెరియాళ్వార్లు

– డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు

భగవంతుడైన శ్రీమన్నారాయణుని నిర్హేతుకకృప వల్ల దివ్యజ్ఞానసంపన్నులైన మహనీయులు 'ఆళ్వార్లు'. వీరు భగవదను భవం (దర్శనం) వల్ల కల్గిన ఆనందమనే సాగరంలో మునిగేవారు కనుక ద్రావిడ భాషలో 'ఆళ్వార్లు' అనే పేరు వీరికి ప్రసిద్ధమైనది. ఆళ్వార్లు అందరు శ్రీమన్నా రాయణుడే పరతత్త్వమనే సిద్ధాంతాన్ని నమ్మినవారు. తమ అనుభవ ప్రకటన రూపాలైన దివ్యప్రబంధాలలో కూడా ఈ సిద్ధాంతాన్నే ప్రవచించారు. ముఖ్యంగా, మధురభక్తి సంప్రదాయాన్ని ప్రోదు చేసినవారిలో ఆళ్వార్లు ముఖ్యులు. ఆళ్వార్ల ప్రబంధాలన్నీ వేదంలో ప్రతి పాదింపబడిన అర్థతత్త్వాలను మధు రంగా అందిస్తున్నందున వీటికి 'ద్రావిడ వేదమ'నే అన్వర్థ వ్యవహారం ఏర్పడింది. అటువంటి ఆళ్వార్లలో **పెరియాళ్వార్లు** ఒకరు.



కొంచెం గమనించి చూస్తే ఈ వ్యవహారం ఏర్పడిన తీరు చాలా విలక్షణంగా కన్పిస్తుంది. "పెరియ" అనేది ద్రావిడ పదం. దీనికి "పెద్ద" – అని అర్థం. భట్ట నాథులు, విష్ణుచిత్తులనే నామా లతో వ్యవహరింపబడే, గోదా దేవిని పెంచిన ఆళ్వారులే పెరి యాళ్వార్లు లోకంలో ముందుగా జన్మించినవారని, పెద్ద అని అంటారు. కాలాన్ని బట్టి చూస్తే, విష్ణుచిత్తులు ఆళ్వార్ల పరంపరలో ముందుగా పుట్టినవారు కారు. ఏడవవారు, వీరు. ఎక్కువ సంఖ్యలో పాశురా లను కాని, ప్రబంధాలను కాని పాడి ఉంటే, అపుడు వీరిని 'పెరియ' అని అనే అవకాశం ఉన్నది. కాని, ఎక్కువ సంఖ్యలో పాశు రాలను పాడినవారు నమ్మాళ్వార్లు కాగా, ఎక్కువ సంఖ్యలో ప్రబంధాలను రచిం చిన వారు తిరుమంగై ఆళ్వార్లు. మరి, ఏ కారణం వల్ల వీరిని పెద్దగా భావించి పెరియాళ్వార్లు అనే పేరు పెట్టడం సంభవించింది? అనే సందేహానికి రెండు సమాధానాలను పెద్దలు తెలిపారు.

సామాన్యంగా, ఏ దైవాన్ని అరా ధించే భక్తుడైనా, ఆ దైవం వల్ల తనకు రక్షణ కలగాలని భావించి, ఆ విధంగా ప్రార్థిస్తాడు. అంటే – తాను ఆరాధించే దైవం 'రక్షక'మని, ఆ దైవంచేత కాపాడ బడే తాను 'రక్ష్య'మనే భావనను ఆరాధకుడు కల్గి ఉండడం సహజం. కాని, భక్తి మరింత పరిణతిని చెంది నపుడు ఈ రక్ష్యరక్షక భావం తారు మారు అవుతుంది. తాను కొలిచే దైవం యొక్క దివ్యరూపాన్ని ఆరాధ కుడు నిరంతరం తన మనస్సులో నిలుపుకొని భావించినపుడు, ఆ రూపంపట్ల నిరతిశయమైన ప్రేమ కల్గుతుంది. ఆ ప్రేమ దశ ఎంతటి ఉత్కృష్టమైన దశను పొందుతుంది? అంటే, ఆరాధించే దివ్యమంగళ రూపానికి ఏ కీడు రాకూడదని, అందుకు తాను చేసే మంగళా శాసనమే రక్ష అనే దృఢమైన భావనను కల్గించే దశను పొందు తుంది. తదనుగుణంగా, అటు వంటి ప్రేమదశలో భక్తుడు తాను ఆరాధించే దైవానికి మంగళం పాడుతూ రక్షను కల్గించే ప్రయత్నం చేస్తాడు. ఇటువంటి గొప్ప ప్రేమ దశను తాము ఆరాధించే శ్రీమన్నారాయ ణుని పట్ల ఆళ్వార్లు అందరు పొందినా, మిగిలిన

జూలై 3న
**పెరియాళ్వారుల**
శాత్తుమొర
సందర్భంగా..

ఆళ్వార్లకు ఈ దశ కాదాచిత్కం (ఏదో ఒక సమయంలో మాత్రం కలిగింది). వీరికి ఆ దశ నిత్యమని, అందువల్లనే వీరికి "పెరియ ఆళ్వార్లు" అనే పేరు కల్గిందని పెద్దలంటారు. దీనికి ప్రమాణంగా శ్రీవరవరమునులు 'ఉపదేశరత్తినమాలై' ప్రబంధంలో పల్కిన "మంగళాశాసనత్తిల్ మట్రుళ్ళ ఆళ్వార్‌కళ్ తజ్ఞ ళార్వత్తుక్కు అళవుతాన్ని పొంగుమ్, పరివాలే విల్లిపుత్తూర్ పట్టర్ పిరాన్ పెట్రాన్ పెరియాళ్వార్ ఎన్నుమ్ పెయర్" (భగవన్మంగళాశాసనం చేయడంలో మిగిలిన ఆళ్వార్ల పరిమితితో కాకుండా - అంటే పొంగే ప్రేమతో విల్లిపుత్తూర్‌లో అవతరించిన భట్టనాథులు పెరియాళ్వార్ అనే పేరును పొందారు) అనే పాశురాన్ని గ్రహించవచ్చు. భట్టనాథులు పెరియాళ్వార్లు అనే పేరును పొందడానికి ఇది ఒక కారణం. వీరి ఈ నిత్యమైన భగవన్మంగళాశాసన పరత్వానికి చిహ్నంగా ఈ ఆళ్వార్లు రచించిన ప్రబంధాలు రెంటిలో మంగళాశాసన ప్రాచుర్యం సుస్పష్టంగా కన్పిస్తుంది.

వీరు రచించిన ప్రబంధాలు-తిరుప్పల్లాండు, పెరియాళ్వార్ తిరుమొళి - అనే రెండు. తిరుప్పల్లాండు ప్రబంధం పూర్తిగా మంగళాశాసన రూపమైనది. పాండ్యరాజు సభలో వాదాన్ని గెల్చి, వాదశుల్కాన్ని బహుమతిగా పొంది, ఆ ప్రభువు చేసే గజారోహణ సమ్మానాన్ని పొందేటపుడు ఆళ్వార్లకు జరిగే ఆ మహోత్సవాన్ని తిలకించాలనే ఆశతో భగవానుడు శ్రీమన్నారాయణుడు సపత్నీకుడై, గరుడునిపై అధిరోహించి ఆకాశంలో వేంచేశాడు. అపుడు భట్టనాథులు ఆకాశంలో సాక్షాత్కరించిన భగవంతుని దర్శించి, భయశంకతో "పల్లాండు పల్లాండు పల్లాండు" అని చేసిన మంగళాశాసనమే ఈ పల్లాండు ప్రబంధం. ఈ ప్రబంధాన్ని అధ్యయనం చేసిన వారికి కలిగే ఫలంకూడా "శూళ్న్దిరున్దు ఏట్రువర్ పల్లాండే" అని నిత్యం భగవన్మంగళాశాసనం చేయగల్గడమే అని ప్రబంధం చివరలో ఆళ్వార్లు తెలియజేశారు.

ఇక, రెండవ ప్రబంధమైన పెరియాళ్వార్ తిరుమొళి కూడా మంగళాశాసన ప్రచారమే. ఈ ప్రబంధంలోని పలుదశ కాలలో ఆళ్వార్లు తమను యశోదగా భావించి, బాలకృష్ణుని బాల్యచేష్టలను, ఏనాడో ద్వాపరయుగాంతంలో యశోద అనుభవించిన, శ్రీకృష్ణునకు చేసిన పలు లీలలను మానసికంగా దర్శించి, ఆనందించి, ఆ అనుభవాన్ని మధురమైన పాశురాల రూపంలో వెలువరించారు. ఈ విధంగా ఆళ్వార్లు యశోదగా భావించడం, ఆమె బాలకృష్ణునకు స్నానం చేయించి, పూలు ముడిచి, తలదువ్వి, చందమామను పిలిచే సన్నివేశాలను తమ ప్రబంధంలోని పాశురాలలో వ్యక్తీకరించారు. ఇది ఈ ఆళ్వార్ల భగవత్ప్రేమ యొక్క పరిణతిలోని పరమావధిని సూచిస్తాయి. కనుక, రెండవ ప్రబంధం కూడా మంగళాశాసనాత్మకమే.

పెరియాళ్వార్లు అనే పేరు కల్గడానికి రెండవ కారణం ఏమంటే- పెరియాళ్వార్లు గోదాదేవిని పెంచిన తండ్రి. గోదాదేవి చిన్నతనం నుండి శ్రీమన్నారాయణుని విషయంలో భక్తినే గాక, ఆ స్వామినే వివాహం చేసుకోవాలనే ప్రేమను పొందింది. వయస్సుతో పాటు, ఆ ప్రేమ వర్ధిల్లి "మానిడవర్ క్కెన్టు పేచ్చు ప్పడిల్ వాళకిల్లేన్" (మానవుల కిచ్చి వివాహం చేస్తాననే మాట వింటే బతుకలేను) అనే దశను పొందింది. శ్రీవిల్లిపుత్తూర్‌లోని వటపత్రశాయి స్వామి ఈమె ప్రేమకు మెచ్చి, ఈమె ముడుచుకొని విడచిన మాలికను ప్రీతి పూర్వకంగా స్వీకరించాడు. శ్రీరంగనాథస్వామి పెరియాళ్వార్లను గోదాదేవిని శ్రీరంగానికి తీసికొని రమ్మని పల్కి, ఆమెను వివాహమాడాడు. ఈ విధంగా, అందరి కంటే పెద్ద అయిన శ్రీమన్నారాయణునకే పిల్లను ఇచ్చి మామ గారైనందున, ఆ స్వామికంటే పెద్దవారయ్యారు, భట్టనాథులు. అందువల్ల కూడా వీరికి పెరియాళ్వార్లు అనే సార్థక నామం ఏర్పడింది. ఈ విషయాన్ని శ్రీవేదాంత దేశికులు గోదాస్తుతిలో *"తాతస్తుతే మధుభిదః స్తుతి లేశ వశ్యాత్ కర్ణామృతైః స్తుతి శతైరనవాప్త పూర్వమ్, త్వన్మౌళి గంధ సుభగా ముపహృత్య మాలాం లేభే మహత్తర పదానుగుణం ప్రసాదమ్"* (గోదాదేవీ! మీ తండ్రి అయిన భట్టనాథులు 'స్తవప్రియః' అనే రీతిలో కొద్ది పాటి స్తుతికి సైతం వశం అయ్యే స్వభావాన్ని కల భగవంతుడైన మధుసూదనుని చెవులకు ఇంపైన పలుస్తోత్రాలను చేసినా పొందని పెరియాళ్వార్లు అనే గొప్ప బిరుదు నీవు నీ శిరస్సుపై అలంకరించుకొని విడచిన మాలికను సమర్పించి పొందారు సుమా!) అనే శ్లోకంలో పలికారు. ఈ శ్లోకంలో "మహత్తర పదానుగుణం ప్రసాదమ్" అంటే పెరియాళ్వార్లు అనే పేరును అనుగ్రహించడమే - అని అభిజ్ఞుల వివరణం.

ఇటువంటి పరమభక్తి రూపమైన ప్రేమదశను పొందిన భక్తిని కల్గి ఉండడం కంటే భక్తుడు కోరదగినది ఇంకొకటి లేదు కదా.

**మిథునే స్వాతిజం విష్ణోః రథాంశం ధన్వినః పురే ।**
**ప్రపద్యే శ్వశురం విష్ణోః విష్ణుచిత్తం పురశ్శిఖమ్ ॥**







ప్రహ్లాద నారద పరాశర పుండరీక, వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్ ।
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్, 'పుణ్యా' నిమాన్ 'పరమభాగవతాన్' స్మరామి ॥

పరమభాగవతులుగా వీరు మన సంప్రదాయంలో గుర్తింపు పొందారు. ప్రతి రోజు వీరిని మనం స్మరించుకున్నట్లైతే ఇహము, పరము రెండూ మనకు లభిస్తాయి. అంతేకాదు భగవంతునికి తనను స్మరించి, ఆరాధించేవారంటే ప్రీతి ఉన్నా, భక్తులపై వారి సేవకులపైన (భృత్యస్య భృత్య పరిచారక భృత్య భృత్యలపై) ఆయనకు పరమ ప్రీతి. ఆయన ఇష్టులైన పరమభాగవతులను స్మరించే వారంటే ఎంతో వాత్సల్యం. అటువంటి పరమ భాగవతుల కోవకు చెందిన వాడే 'ప్రహ్లాదుడు'.

ప్రహ్లాదుని పేరు వింటేనే నారాయణుని పట్ల అచంచలమైన భక్తి, ప్రేమ, సహనము సేవలకు నిర్వచనంగా చెప్పాలి. ప్రహ్లాదుడు అందుకే పరమభాగవతుల్లో మొదటిస్థానం దక్కించుకున్న మహాభక్తుడు. రాక్షసవంశంలో జన్మించినా దైవీగుణాలతో భాసిల్లిన కారణజన్ముడు. తల్లిగర్భంలో ఉండగానే నారదమహర్షి వల్ల నారాయణ దివ్యమంత్రాన్ని, తత్త్వాన్ని గ్రహించినవాడు. ఇతని తండ్రి హిరణ్యకశిపుడు, తల్లి లీలావతి. అసురవంశ సంజాతుడైన ప్రహ్లాదుడు శ్రీమహావిష్ణువుకు పరమభక్తుడు. చండామార్కులు ఈతని గురువులు. హరినామం స్మరించవద్దని, హరిభక్తి విడిచిపెట్ట మని ఎంత చెప్పినా, తండ్రి హిరణ్యకశిపుడు ఎన్నోరకాలుగా హింసించినా, తనకున్న భక్తి మార్చుకోక దృఢమైన విశ్వాసంతో నారాయణుని ఆరాధించిన పరమ భాగవతుడు.

ఇక్కడ తండ్రి తన కన్నకొడుకును కష్టాలపాలు జేసి చిత్రహింసలు పెడతాడు. ఏనుగులతో త్రొక్కిస్తాడు. విషాన్ని తినిపిస్తాడు. పాములతో కరిపిస్తాడు. సముద్రంలో విసిరి పారేయిస్తాడు. ఎక్కడైనా ఇలా జరుగుతుందా? అన్పిస్తుంది. అయితే బాలలు! ఇన్ని ఇబ్బందులకు గురైన ఆ అబ్బాయి తన లక్ష్యాన్ని వదలలేదు. తను నమ్మిన దైవాన్నీ వీడలేదు. ఆ హింసలతన్ని ఏమి చేయలేకపోయాయి. నమ్మిన దైవమే అతణ్ణి కాపాడింది. ఆ బాలుడు సామాన్యుడు కాదు మహాభక్తుడు. అతని భక్తికి నిదర్శనం ఏమిటో తెలుసా 'నా స్వామిని ఎక్కడైనా చూపిస్తానని' తండ్రితో అతను అంటాడు. అప్పుడు శ్రీమహావిష్ణువు నరసింహావతారంతో ప్రపంచంలో నలుదిశలా నిండిపోయాడు, తన భక్తుడి మాట నిలబెట్టడానికే. ఆ రాక్షసుని పాపం పండింది. హరి ఇందులో ఉన్నాడా.... అని ప్రక్కన ఉన్న స్తంభాన్ని చూపించాడు. అప్పుడు ప్రహ్లాదుడు –

ఇందుగలడందులేడని, సందేహం వలదు చక్రిసర్వోపగతుండు
ఎందెందు వెదికి చూసినా, అందందే కలడు దానవాగ్రాణి కంటే

– అని ప్రహ్లాదుడు అన్న వెంటనే ఆ స్తంభం పగులకొట్టాడు. భగవంతుడు అందులోంచే నరసింహాకారంతో ఆవిర్భవించాడు. అలా దేవుణ్ణి అంతటా చూపగల బాలుడు ప్రహ్లాదుడు.

మన ఇతిహాస పురాణాలకు చెందినవారిని గురించి పిల్లలకు చెప్పాలి. వారు పడిన కష్టాలను గురించి చెప్పినప్పుడు వాటి ప్రభావం లేతమనస్సుపై సంస్కారముద్ర లను వేయగలుగుతుంది. అవి భవిష్యత్తులో వారికెంతో ఉపయోగపడతాయి. ఈ ధార్మిక జ్ఞానం చిన్నిపిల్లల్లో కలిగినపుడు, ఆ జ్ఞానం జీవితాంతం వారికి ఉపకరిస్తుంది.

బాలప్రబోధం

# ప్రహ్లాదుడు

– శ్రీమతి ఎం.మంజుల





ప్రహ్లాదుని పేరు వినగానే నారాయణుని పట్ల అచంచలమైన భక్తి, ప్రేమ, సహనము సేవలు గుర్తొస్తాయి. అందుకే ప్రహ్లాదుడు పరమభాగవతుల్లో మొదటిస్థానం దక్కించుకున్న మహాభక్తుడు.

ఇందుకు మన ఇతిహాసంలో మహాపురుషుల, మహనీయుల, మహావీరులైన వారినీ, మన సంస్కృతికి చక్కని పునాదులు వేసే వారి కథలు బాలలందరికి తల్లిదండ్రులు నేర్పాలి. ఏ ప్రయత్నమైన పెద్దలతోనే ఆరంభం కావాలి. అప్పుడే ఆ బిడ్డలు ఆదర్శవంతులుగా తయారవుతారు.

ఇప్పటినుండి పిల్లలలో నైతికమైన విలువను ఆధ్యాత్మిక చింతనను పెద్దలు అలవాటు చేస్తే భవిష్యత్తులో ఉత్తమ పౌరులుగా వెలుగొందుతూ ఆదర్శజీవితం సాగిస్తారు. బాల్యంలో సత్ప్రవర్తన, సచ్ఛీలత, సదాచారం వంటి సద్గుణాల వైపు పిల్లల్ని జాగ్రత్తగా నడిపించాలి. అప్పుడే పిల్లలు పెద్దవారై బాధ్యత కల్గిన పౌరులుగా తీర్చిదిద్దబడతారు.

కనుక, ప్రహ్లాదుడు దేవుడిపై తనకున్న అపారభక్తిని తండ్రికి తెలియజేసి అన్ని చోట్ల అంతర్యామిగా భగవంతున్నాడని నిరూపించాడు. బాలలైన మీరందరూ కుటుంబ సంక్షేమం కోసం శ్రమిస్తునే, మరోవైపు సమాజ శ్రేయస్సుకు పాటుపడాలి. తద్వారా భారత దేశం ఔన్నత్యం ఇనుమడిస్తుంది. ప్రహ్లాదుని వంటి మహాభక్తుల కథ - లక్ష్యం కోసం వారు జీవించిన విధానం అందరికీ ఆదర్శమైనది. భారతీయ ఆధ్యాత్మిక సంపదను, తమ సమకాలీనులకే కాక భవిష్యత్తరాలవారికి కూడా పంచి, అందరిలో ఆధ్యాత్మిక జ్యోతిని వెలిగించి జీవితానికి అర్థం పరమార్థం తెలియజేసి, ఆదర్శమయమైన జీవితాన్ని గడిపిన వీరంతా మనకు అనుస్మరణీయులు.

## వైకుంఠపాళి

### :: 20 - సమాధానాలు ::

| | 1 తు | 2 ల్య | భా | 3 గా | న | 4 ది | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 5 కొ | | కు | | ల | | వ్వె | | 6 బా |
| 7 స | రం | | 8 ల | వు | డు | | 9 బా | స |
| ర | | 10 సం | | డు | | 11 త్రి | | ర |
| | 12 క | ది | రి | | 13 భ | జ | న | |
| 14 న | | ని | | 15 వం | | ట | | 16 న |
| 17 ము | ని | | 18 న | గ | జ | | 19 ఫ | లం |
| చి | | 20 క | | కా | | 21 గం | | ద |
| | 22 అ | ళ | గి | య | సిం | గ | ర్ | |

## శ్రీకపిలేశ్వరస్వామి పవిత్రోత్సవాలు

**ప్రతి సంవత్సరం ఆషాఢమాసంలో పున్నమి ముందు ఉన్న చతుర్దశి నాటికి పూర్తయ్యేటట్లు మూడు రోజుల పాటు శ్రీకపిలేశ్వరస్వామి క్షేత్రంలో పవిత్రోత్సవాలు జరుగుతాయి. ఏడాది పొడవునా, శ్రీకపిలేశ్వరస్వామి ఆలయంలోను, అర్చనాది కార్యక్రమాల్లోను, జరిగే ఉత్సవాల్లోను, పుష్కరిణి తీర్థ పరిసరాల్లోను ఇలా ఆ క్షేత్రం అంతటా తెలిసికొన్ని, తెలియక కొన్ని దోషాలు, లోపాలు జరుగుతుంటాయి. జరుగుతాయి కూడా. ఇలాంటి దోషాలు అర్చక పరివారం, ఆలయ సిబ్బంది మాత్రం చేతనేకాక, యాత్రికుల వల్ల కొంత సంభవిస్తుంటాయి. దీని వల్ల ఎప్పటికప్పుడు ఆలయ పవిత్రతకు ఏ మాత్రం లోపాలు కలగకుండా భంగం వాటిల్లకుండా, ఆలయ పవిత్రీకరణం కోసం శాస్త్రోక్తంగా జరిగే ఉత్సవాలే పవిత్రోత్సవాలు.**



**ముందుగా ఆషాఢ ఏకాదశి నాటి ప్రదోషకాలంలో పవిత్రోత్సవాలకు మృత్సంగ్రహం, పిదప అంకురార్పణ కార్యం జరుగుతుంది. ఆ మరునాడు హోమాది కార్యక్రమంలో శైవాగమ శాస్త్రోక్తంగా అందరి దేవతలను కలశాలలో ఆవాహన చేసి ప్రతిష్ఠిస్తారు. పిదప పవిత్రాల ప్రతిష్ఠ జరుగుతుంది. రెండవనాడు ఆ పవిత్రాలను ఆలయంలో శ్రీకపిలేశ్వర మూలలింగం మొదలుకొని, కపిలేశ్వర మూలమూర్తులకు, ఉత్సవమూర్తులకు, ధ్వజస్తంభ బలిపీఠాలకు, ఆలయశిఖరాలకు సమర్పింపబడుతుంది. మూడవ నాడు పూర్ణాహుతి. అది ఈ సంవత్సరం జూలై 4 నుండి 7వ తేదీ వరకు జరుగుతాయి.**





మధుకరం చాలాకాలం ఎంతో శ్రమించి తేనెను కూడబెడుతుంది. ఎక్కడ్నుంచో ఒకడు వచ్చి తేనెపట్టు విదిలించి తేనెనంతా తాగాడు. చిరకాల కష్టార్జితమైన ఫలం అనుభవించ డానికి ఆ తేనెటీగ నోచుకోలేదు. ఇది కనుగొన్న అవధూత తేనెటీగకు నమస్కరించి "ఓ మధుకరమా! నువ్వే నాకు గురువు. కూడబెట్టిన ధనాన్ని నిజానికి ఏ గతి ప్రాప్తించేది నీ వల్ల నేను గ్రహించాను."– అలా తేనెటీగ అవధూతకు గురువైంది.

సంప్రదాయకమైన గురుశిష్య సంబంధం, ప్రాధాన్యత మన ప్రాచీనభారతంలో దర్శనమిస్తుంది. శిష్యులు ఆ వాతావరణంలో పెరిగినప్పుడు, గురుకుల పద్ధతుల్లో ఆ శిష్యుడు బహుముఖీనంగా విద్యనభ్యసించడం జరుగుతుంది. సంప్రదాయకమైన విద్యతో బాటు నైతిక విలువలకు సంబంధించిన అంశాలను కూడా నేర్చుకోవడం చూస్తాం. పురాణాల్లో శ్రీరాముడు, కృష్ణుడు ఆ విధంగా ఎదిగిన వారే. విశ్వామిత్రుడు, సాందీపని గురువుల వద్ద శిక్షణ పొందిన వారే!

ఆషాఢమాసంలో వచ్చే పౌర్ణమిరోజున **'గురుపూర్ణిమ'**ను జరుపుకుంటాం. అందరూ తమ తమ ఆధ్యాత్మికగురువులకు నివాళులర్పిస్తారు. మహాభారతం, భాగవతం, పురాణాలనందించిన వేదవ్యాసుని జన్మదినం కూడా ఇదే రోజు కావడం విశేషం.

**జూలై, 9న గురుపూర్ణిమ సందర్భంగా...**

# శ్రీగురుభ్యోనమః

– శ్రీ ఎం.ఎం.ఈశ్వర్

సూర్యుని నుండి వెలువడే కాంతి పరావర్తనం చెందడం వల్ల చంద్రుడు మిల మిలా మెరుస్తాడు. శిష్యులంతా తమ తమ గురువుల నుండి గ్రహించిన జ్ఞానాన్ని అదే విధంగా వ్యాపింపజేయగలుగుతారు... పంచగలుగుతారు.

శాస్త్రం ప్రకారం – ఎవరైతే అవిద్యను తొలగిస్తారో, అజ్ఞానపు చీకట్లను పారద్రోలుతారో వారిని 'గురువు' అంటారు. గురుశిష్యుల సంబంధం సంక్లిష్టమైనదిగా చెప్పుకోవచ్చు. ఆధ్యాత్మిక పరమైన చిక్కులతో కూడుకున్నది. గురుశిష్యుల సంబంధంగురించి చాలామంది మాట్లాడుతుంటారు. దీన్ని గూర్చి భిన్నాభిప్రాయాలూ ఉన్నాయి.

ధర్మగ్రంథాలనుండి గానీ, సాధువులు, సన్యాసులనుండి గానీ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని సంపాదించవచ్చు. ప్రత్యేకంగా ఒక్క గురువును ఎంపిక చేసుకోవడందేనికి– ఒకే గురువు వద్ద ఉండినట్లయితే ఆధ్యాత్మికతను ఒక భాగంగా చేసినట్లువుతుంది కదా – అనేది ఒక వాదన.

'ఉపాధ్యాయుడికి', 'గురువుకు' తేడా ఉంది. ఉపాధ్యాయుడు అభ్యాసం విషయంలో సహాయపడతాడు. గురువు– పరిణామం తీసుకురావడానికి, మనమేమిటన్న యదార్థాన్ని గ్రహించడానికి తోడ్పడుతాడు. మనిషి సంపాదించుకునే పరి మితమైన జ్ఞానాన్ని 'అహం' నుండి – 'నేను' అన్న బలమైన భావననుండి పొందుతాడు, దాంతోటే జీవిస్తాడు. దేవసంబంధమైన జ్ఞానం పొందాలంటే ముందు అహాన్ని విడిచి పెట్టాలి. సమర్పణ భావం కలగాలి. అప్పుడే సాధ్యం.



అహం లేకుండా సంపూర్ణంగా ఆ దైవానికి లేదా దైవసమానుడైన గురువుకు లొంగిపోయినప్పుడే ఆధ్యాత్మిక ఎదుగుదలకు మార్గం ఏర్పడుతుంది. మనిషి తన నిజస్థితిని కేవలం స్వయంకృషి ద్వారా తెలుసుకోలేడు. 'నేను' అన్న ఊబి నుండి బయట పడడానికి మళ్ళీ దృష్టికోణం మారాలి. ఆధ్యాత్మిక జ్ఞానం కలగాలి. దానికి దైవకృపకూడా తోడ వ్వాలి. గురువు ప్రమేయం అహాన్ని తొలగించుకోవడానికి, ఆలోచనలో పరిణతి సాధించడానికి, ఉన్నత భావాలను కల్గి ఉండడానికి, భగవంతుని శరణుకోరడానికి, ఆత్మ బోధకు అవసరమవుతుంది.

గురువు అంటే అన్నీ తెలిసినవారో, అన్నీ తెలిసినవారి నుండి ఆశీస్సులు పొంది గురుహోదాకు అర్హులైన వారో అయి ఉండాలి. మంచి గురువును పొందడమెలాగ – అంటే ఆధ్యాత్మిక పరమైన ధర్మం ఒకటుంది. ఎప్పుడైతే శిష్యుడు సిద్ధంగా ఉండటం జరుగుతుందో, గురువు ఆ శక్తికి ఆకర్షింపబడినట్లవు తుంది, గ్రహణశీలత ఏర్పడుతుంది ఆ సమయం తటస్థించి నపుడు అని పెద్దలు చెబుతారు.

కొన్ని శక్తుల సమ్మిళితం యోగ... మూలపదార్థం, చైతన్యం, ధర్మజ్ఞానం.. సాధారణ మానవుడు ఉన్నతస్థితికి చేరు కోవడం ఒక మహర్దశ. గురువు నుండి పదార్థం గురించిన అవగాహన పొందడం, వాటి లక్షణాలను తెలుసుకుని అను భవం సంపాదించడం, తనలోని, తన పరిసరాల్లోను మార్పులు తీసుకురావడం... ఒకదాని తర్వాత మరొకటి జరుగుతాయి.

పృథ్వి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచ భూతాలతో ఈ సృష్టి ఏర్పడింది. వీటి వల్లనే వృక్షాలు, పక్షులు, జంతువులు.... సర్వప్రాణికోటితో బాటు నదులు, కొండలు.....

పృథ్వి ఈ శరీరానికి ఆకారాన్నిచ్చి సహకరిస్తుంది. నీరు శుద్ధికి, పునరుత్పత్తికి తోడ్పడుతుంది. అగ్ని శరీరానికి కావల్సిన శక్తిని అందిస్తుంది. వాయువు శరీరంలోని వివిధ భాగాలకు పోషకాలను సరఫరా చేస్తూ పెరుగుదల సమకూరు స్తుంది. శరీరంలో చోటు చేసుకునే మార్పులు అంటే ఈ మూల కాలలో కలిగే మార్పులే. వయసు మీద పడినా, అనారోగ్యం పాలైనా దానిక్కారణం మూలకాలలో వచ్చిన మార్పుగా చెప్పుకో వలసి ఉంటుంది.

పౌర్ణమి రోజున – పూర్ణాకృతిలో చంద్రుడు అమిత మైన శక్తితో కూడి ఉంటాడు. కాబట్టి అమృతం ఉత్పత్తి కావడం పెరుగుతుంది. ఈ మూలపదార్థాల గురించి, సకల చరాచర సృష్టి గురించి తెలుసుకోవాలంటే 'గురుపూర్ణిమ' సరియైన రోజంటారు.

సహజంగా మనిషి గందరగోళ పరిస్థితుల్లో ఉంటాడు. కాబట్టి గురువు సహాయం అవసరం. గురువు యదార్థాన్ని వివరి స్తాడు. జీవితంలో ఆయనకు అవగాహన, అనుభవం ఎక్కువ. విషయ పరిజ్ఞానం, పరిశీలనా దృక్పథం ఎక్కువ. తండ్రిలా నిలబడతాడు, ఉపాధ్యాయుడిలా శిక్షణనిస్తాడు. గందరగోళ పరి స్థితుల్నుంచి బయటపడేస్తాడు. వాస్తవానికి అయోమయ పరి స్థితుల్ని మనిషే సృష్టించుకుంటాడు. వివేకం లోపించడమే అందు క్కారణం. ఆత్మజ్ఞానం సంపూర్ణంగా ఉన్నవారికి గురువు అవసర ముండదు.

మనిషి మనసు ఏ విధంగా ప్రవర్తిస్తూంటుందో గురువుకు బాగా తెలుసుంటుంది. దాని నియంత్రణలో సహాయ పడగలడు. శిష్యులకు ఎన్నో బాధలు, కష్టాలు, కన్నీళ్ళు, సరదాలు, నవ్వులు ఉంటాయి. ఆనందం కలిగినపుడు ఉప్పొంగి పోవడం, పొరపాట్లు దొర్లినప్పుడు క్రుంగిపోవడం జరుగుతుం టుంది. గురువు సమస్థితిని తెలియజేసి వారి ఉన్నతికి, వికాసా నికి ఉపాయం సూచిస్తాడు. ఆధ్యాత్మికరంగంలో అనుభవం కలిగిన వారే గురువు. కొండల్లాంటి అడ్డంకులనైనా ఎదుర్కోగల గొప్ప శక్తి గురువుకుంటుంది.

శిష్యుడికి ఉపదేశం చేసి అతణ్ణి తిరిగి పట్టించుకోని వాడు గురువులలో 'అధముడు'. శిష్యుడి హితం కోరి విషయం గ్రహించేవరకు ఉపదేశాలు నూరిపోసి, తన శిష్యుడి క్షేమాన్ని కాంక్షించి శ్రద్ధవహించే గురువు 'మధ్యముడు'. శిష్యుడు సరిగ్గా తన ఉపదేశాలు విని యథావిధిగా వాటిని ఆచరించటంలేదని కనుగొనగానే నిర్బంధంలో అతణ్ణి విధేయుడిగా చేసేటువంటి గురువు 'ఉత్తముడు'.

భగవంతుడి పట్ల నిజమైన భక్తి కుదిరి సాధనపట్ల ఆసక్తి ఉన్న వ్యక్తికి దైవమే సాయపడి తగిన గురువును తప్పక దగ్గర చేస్తుంది. దాని కోసం ఆందోళన అనవసరం.

గురువులు వేలాది లభిస్తారు. కానీ, శిష్యుడొకడు దొరకడం దుర్లభం అంటారు పెద్దలు. ఒక్కముక్కలో చెప్పాలంటే అజ్ఞానాంధకారాన్ని నిర్మూలించి సాక్షాత్కారకమలాన్ని వికసింప జేసే విష్ణుస్వరూపుడే 'గురువు'.







# చాతుర్మాస్యాలు

- డా॥ అయాచితం నటేశ్వరశర్మ

ప్రతి సంవత్సరం ఆషాఢశుక్ల ఏకాదశి నుండి ప్రారంభమై కార్తిక శుక్ల ఏకాదశితో సంపూర్ణమయ్యే నాలుగు నెలల పుణ్యకాలాన్ని 'చాతుర్మాస్యం' అంటారు. చతుర్మాసాల సమూహమే చాతుర్మాస్యం. ఈ నాలుగు నెలల కాలం లోకంలోని ఆస్తికులందరూ పుణ్యకర్మాచరణకు యోగ్యకాలంగా పరిగణిస్తారు. ఆషాఢశుక్ల ఏకాదశి 'శయనైకాదశి'గా సుప్రసిద్ధం. ఈ పుణ్యదినాన మహావిష్ణువు యోగనిద్రతో శయనిస్తాడని, అందుకే దీనిని 'శయనైకాదశి' అంటారనీ సంప్రదాయం చెబుతోంది.

సాధారణంగా దేవతలు ఉత్తరాయణంలో మేల్కొని ఉంటారనీ, దక్షిణాయనంలో నిద్రిస్తారనీ నమ్మకం.

ఈ కారణంగా దక్షిణాయనంలో అంతర్భాగాలైన ఈ నాలుగునెలలూ దేవతలకు నిద్రాసమయాలు. కనుక ఈ సమయంలో వ్రతాలు, ఉపవాసాల ద్వారా తపస్సు పుణ్యప్రదమని అందరూ విశ్వసిస్తారు.

కార్తిక శుక్ల ఏకాదశి 'ఉత్థానైకాదశి'గా లోక విదితం. ఈ పుణ్యదినాన మహావిష్ణువు నిద్ర నుండి మేల్కొంటాడనీ, అందుకే దీనిని 'ఉత్థానైకాదశి' అంటారనీ సంప్రదాయ కథనం. దేవతలు మేల్కొనే దినం అయిన ఈ దినం ఉపాసనకు అత్యంతోపయుక్తం.

పూర్వకాలం వర్షర్తువుతోనే సంవత్సరగణన ప్రారంభం అయ్యేది. అందుకే 'వర్షం' (సంవత్సరం) అనే అర్థాన్ని ఇచ్చే పదాన్ని ఈ ఋతువుకు నిర్దేశించారని అంటారు. ఆనాడు వర్ష, హేమంత, వసంతాలనే మూడు ఋతువులే ఉండేవి. ఒక్కొక్క ఋతువు ప్రారంభమయ్యే దినాన ఒక్కొక్క యజ్ఞం చేస్తూ, జీవితానికి పరమార్థాన్ని సాధించేవారు.

మానవుల ఆరోగ్యాలను చెడగొట్టే కఫ, వాత, పిత్త, శ్లేష్మాలనుండి దూరం కావడానికి నియమపూర్వకమైన చాతుర్మాస్య దీక్ష ఉపయోగపడేది.

ఈ నాలుగు నెలల కాలంలో మనుష్యులు ఎలాంటి నియమాలను పాటించాలో తెలిపే శ్లోకం ఇలా ఉంది -

**ఏకభుక్త మధశ్శయ్యా బ్రహ్మచర్యమహింసనమ్**
**వ్రతచర్యా తపశ్చర్యా కృచ్ఛ్రచాంద్రాయణాదికమ్**
**దేవపూజా మంత్రజపో దశైతే నియమాః స్మృతాః**

అంటే చాతుర్మాస్యకాలంలో మనిషి ఒకే పూట భోజనం చేయాలి. నేలపైనే పడుకోవాలి. బ్రహ్మచర్యాన్ని పాటించాలి. హింసను విసర్జించాలి. దేవతల ప్రీతికై వ్రతాలను ఆచరించాలి. తపోదీక్షలోనే ఉండాలి. దోష పరిహారాత్మకాలైన చాంద్రాయణాదివ్రతాలను చేయాలి. దేవపూజలూ, మంత్రజపాలూ మానరాదు. ఇలా పదివిధాలైన నియమాలను తప్పక పాటించాలి అని అర్థం. ఇలా అన్నంతమాత్రాన ఇతరకాలాలలో వీటిని పాటించనక్కలేదని అర్థం చేసుకోరాదు. ఈ పది నియమాలూ ఏడాదిపొడుగునా పాటించవలసినవే. అయితే ఇతరకాలాలలో ఏ కొన్నింటిని వదిలేసినా, ఈ చతుర్మాసాలలో మాత్రం విధిగా ఆచరించాలని తాత్పర్యం.

## తి.తి.దే.అతిథిగృహం, రిసెప్షన్ విభాగం, తిరుమల

**కార్యనిర్వహణాధికారి ఆదేశాల ప్రకారం తిరుమల తిరుపతి దేవస్థానం అతిథిగృహం శ్రీపద్మావతి నగర ప్రాంతం, తిరుమలలో నూతనంగా నిర్మించిన 'జిందాల్' (ఓ.ఎం.ఎన్.ఎస్.) విశ్రాంతి గృహం సూట్లు 1 నుండి 8 వరకు ధర టారిఫ్ రూ.1,500/- మరియు రూ.2,500/-లను రూ.3,000/-లకు పెంచడమైనది. ఈ పెంపుదల విశ్రాంతి గృహం 24 గంటలు (లేదా) పాక్షికంగా తీసుకొన్నను వర్తిస్తుంది.**

*- ఉపకార్యనిర్వహణాధికారి (ఆర్-1) ఎఫ్.ఏ.సి.*



ఈర్ష్య కలహానికి మూలం; ఓర్పు సంపదలకు మూలం

నాలుగునెలల పుణ్యకాలంలో పుణ్యకర్మలైన వ్రతాలూ, తపస్సులూ, ధ్యానాలూ, పూజలూ, జపాలూ, తీర్థక్షేత్రయాత్రా సందర్శనలూ, దానాలూ, యజ్ఞాలూ, పారాయణాలూ మొదలైన వన్నీ మనుష్యులను త్రికరణాలలోనూ పునీతులనుగా చేస్తాయని పారంపరిక విశ్వాసం. వీటిని ఆచరించడానికి స్త్రీపురుష భేదం లేదు. వయోనియమం అంతకన్నా లేదు. స్త్రీలూ, పురుషులూ ఈ చాతుర్మాస్య నియమాలను పాటించవచ్చు.

బాల, యువక, వృద్ధదశలలో ఉన్నవారెవరైన వీటిని ఆచరించవచ్చు. ఆచరించాలనే సంస్కారం కలగడమే ప్రధానం. సాధారణంగా లోకంలో వృద్ధాప్య దశకు చేరుకున్న వారు మాత్రమే ఆధ్యాత్మిక చింతన చేస్తారనే నమ్మకం ఒకటి వేళ్లూను కొని ఉంది. కాని, శంకరభగవత్పాదుల వంటి జగద్గురువులనూ, శుకమహర్షివంటి యోగులనూ చూస్తే చిన్న వయస్సులో కూడా ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని సాధించవచ్చునని తెలుస్తుంది. ఇలాంటి ఉన్నతిని సాధించడానికి ప్రేరణను అందిచేవే చాతుర్మాస్యాలు.

**తొలి ఏకాదశి నుండి ఉత్థానఏకాదశి వరకు అంటే చాతుర్మాసంలో ఆచరించాల్సిన వ్రత ఆహార నియమాలు ఈ విధంగా ఉంటాయి. అవి 1) మొదటిమాసం శాకావ్రతం (కూరగాయలు, చింతపండు వాడకూడదు), 2) రెండవమాసం దధి వ్రతం(పెరుగు సంబంధమైనవి ఏవీ వాడకూడదు), 3) మూడవ మాసం క్షీరావ్రతం (పాలు వాడకూడదు), 4) నాల్గవమాసం ద్విదలవ్రతం (ముడి ధాన్యాలు వాడకూడదు). ఈ మాసాలలో వచ్చే ఏకాదశి నాడు ఉపవాసం ఉండడం శ్రేష్ఠం.**

స్వయంగా ఆచరించడం ద్వారా, ఆచరించేవారిని చూడడం ద్వారా, మనస్సులో ఉన్నతభావాలను పెంచుకోవడం ద్వారా, వాక్కులకు సంబంధించిన నియమాల ద్వారా, మౌన వ్రతాల ద్వారా అద్భుతమైన, అపూర్వమైన దివ్యశక్తిని మనిషి సాధించగలడు. అందుకే 'సాధనాత్ సాధ్యతే సర్వమ్' అని ప్రాచీనుల ఉపదేశం. నిత్యం చేసే సాధన వల్లనే లోకంలో సమస్త విషయాలనూ సాధించుకోవచ్చు అనేది ధార్మికోపదేశం. కనుక ధర్మాన్ని ఆచరించడానికి వెనుకాడరాదు.

మనిషికి దివ్యశక్తుల జాగరణమే సకల విజయాలకూ మూలమని ప్రాచీనగ్రంథాలు చెబుతున్నాయి. దివ్యశక్తులను మేలుకొలపాలంటే దేవతలను ఆరాధించడమే ఏకైక మార్గమని చాతుర్మాస్యాలు ప్రబోధిస్తున్నాయి. వర్షర్తువుతో ప్రారంభమయ్యే నాలుగునెలలూ ప్రాకృతికంగా ఎన్నో మార్పులకు నిలయాలు. ఈ మార్పులను మానవశరీరం జీర్ణించుకోవాలంటే యుక్తాహార విహారాలూ, యుక్తచేష్టలూ, యుక్త స్వప్నజాగరణలూ అవసరం. అతిగా ఆహారాన్ని తీసుకుంటే శరీరం బరువెక్కి నిద్రకు ఉపకరిస్తుంది. నిద్రవల్ల శరీరంలో స్థౌల్యం ఏర్పడి అనారోగ్యాలు కలుగుతాయి. కనుక, మితాహారం, మితనిద్ర, మితవిహారం మనిషికి చాలా అవసరం.

మనిషిలోని అన్ని ఇంద్రియాలనూ నియంత్రిచేది మనస్సే. మానవశరీరంలో పంచజ్ఞానేంద్రియాలూ, పంచకర్మేంద్రియాలూ ఉన్నాయి. చర్మం, కన్నులు, నాలుక, చెవులు, ముక్కు అనేవి జ్ఞానేంద్రియాలు. అంటే చర్మం ద్వారా స్పర్శ జ్ఞానం, కన్నుల ద్వారా దృశ్య జ్ఞానం, నాలుక ద్వారా రుచి జ్ఞానం, చెవులు ద్వారా శ్రవణ జ్ఞానం, ముక్కు ద్వారా గంధ జ్ఞానం కలుగుతుంది.

వాక్కు, చేతులు, కాళ్లు, మూత్ర, మలద్వారాలు కర్మేంద్రియాలు. అంటే వాక్కు ద్వారా భాషణకర్మ, చేతుల ద్వారా ధారణకర్మ, పాదాల ద్వారా గమనకర్మ, మూత్ర, మల ద్వారాల ద్వారా మలమూత్ర విసర్జన కర్మలూ జరుగుతాయి. ఈ జ్ఞాన, కర్మేంద్రియాలను గూర్చి తెలుసుకొంటూ, వాటిని మనస్సు నియంత్రిస్తూ ఉంటుంది. కనుక మనిషి తన పది ఇంద్రియాల ద్వారా నియమవిరుద్ధమైన చర్యలు జరుగకుండా చూడాలంటే మనస్సును అదుపులో ఉంచుకోవడం అవసరం. ఆ మనస్సును అదుపులో ఉంచడానికి చేసేవే చాతుర్మాస్య వ్రతాలు. వ్రతోపవాసాదుల ద్వారా మనస్సు అదుపులోకి వస్తుంది. సుఖాలమీద, వ్యసనాల మీద ఆలోచన తగ్గుతుంది. అప్పుడు శరీరం స్వాధీనమై, ఆరోగ్య భాగ్యాన్ని కలిగి ఉంటుంది.

ఇదే చాతుర్మాస్యాల విశిష్టత. పరంపరగా ప్రాచీన కాలం నుండి చెబుతున్న ధర్మాలన్నీ ఈ సత్యాలను ప్రతిబింబించేవే అని తెలుసుకుంటే చాతుర్మాస్యంలోగల అంతరార్థం తెలుస్తుంది.







కఠినమైన వాక్కును త్యజించు



వజ్రకవచాలంకారంలో ఉభయదేవేరులతో శ్రీవారు



ముత్యాల కవచాలంకారంలో ఉభయదేవేరులతో శ్రీవారు



స్వర్ణకవచాలంకారంలో ఉభయదేవేరులతో శ్రీవారు



హోమం నిర్వహిస్తున్న ఋత్విక్కులు



ఉత్సవమూర్తులకు అభిషేకం



కలశారాధన



స్వర్ణకవచాలు

తిరుమలలో...
2017 జూన్ 7 నుండి 9 వరకు జరిగిన
శ్రీవారి జ్యేష్ఠాభిషేక మహోత్సవ దృశ్యాలు



పాల్గొన్న తి.తి.దే. ఉన్నతాధికారులు, ప్రధాన అర్చకులు



పాల్గొన్న భక్తులు



2017 జూన్ 5 నుండి 14 వరకు జరిగిన
అప్పలాయిగుంట
శ్రీప్రసన్న వేంకటేశ్వరస్వామివారి
బ్రహ్మోత్సవ దృశ్యమాలిక



పెద్దశేషవాహనంపై ఉభయదేవేరులతో స్వామివారు

ధ్వజారోహణ కార్యక్రమం



గజవాహనంపై స్వామివారు



గరుడవాహనంపై స్వామివారు



హంసవాహనంపై స్వామివారు



హనుమంతవాహనంపై స్వామివారు



ముత్యపుపందిరి వాహనంపై స్వామివారు



చిన్నశేషవాహనంపై స్వామివారు



కల్పవృక్షవాహనంపై స్వామివారు



మోహినీ అలంకారంలో స్వామివారు













తిరుపతి, శ్రీకోదండరామస్వామివారి దేవాలయంలో జూన్ 14 నుండి 16 వరకు అష్టబంధన మహాసంప్రోక్షణ కార్యక్రమం జరిగింది

ఈ క్రతువులో వివిధరాష్ట్రాల నుంచి ఋత్విక్కులు, వేదపారాయణదారులు,
తి.తి.దే. ఉన్నతాధికారులు, సిబ్బంది మరియు వేదవిద్యార్థులు పాల్గొన్నారు.



2017, మే 21వ తేది తిరుమల శ్రీవారిని దర్శించుకున్న
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నారాచంద్రబాబు నాయుడుగారు



దర్శనానంతరం శ్రీస్వామి అమ్మవార్ల చిత్రపటాన్ని బహూకరిస్తున్న
తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారి, సంయుక్త కార్యనిర్వహణాధికారి (తిరుమల)





తిరుమల వైకుంఠం క్యూ కాంప్లెక్సునందు చిన్న పిల్లలకు ఉచితంగా అన్నివేళలా పాలు పంపిణీ











తిరుపతిలో శుభప్రదం వేసవి శిక్షణ తరగతులు ప్రారంభిస్తున్న తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ అనిల్‌కుమార్ సింఘాల్, ఐ.ఏ.ఎస్.
తదనంతరం తి.తి.దే. సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ పోల భాస్కర్, ఐ.ఏ.ఎస్.గారు విద్యార్థినీ విద్యార్థులకు యోగ్యతాపత్రాలను అందజేశారు.
(విద్యార్థినీ విద్యార్థులకు సనాతనధర్మ మానసిక వికాసంపై శిక్షణా తరగతులను ఉభయరాష్ట్రాలలో తి.తి.దే. ఇటీవల నిర్వహించింది)

పచ్చతోరణం

# నిత్యకల్యాణస్వామికి ప్రతినిత్యమూ సేవలే!

- శ్రీమతి వి. అరుణ

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడిగా, ఆపద్బంధువుగా, అర్చామూర్తిగా ప్రసిద్ధికెక్కిన తిరుమల శ్రీవేంకటేశ్వర స్వామికి నిత్యం ఎన్నో ఉత్సవాలు వైఖానస ఆగమశాస్త్రోక్తంగా ఆచరింప బడుతున్నాయి. సంసార సాగర తాపత్రయ సందోహమానసులైన భక్తజనులను ఉద్ధరించుటకై ఆగమశాస్త్ర గ్రంథములందు అనేకములైన నిత్య–నైమిత్తిక–కామ్యోత్సవాలు జరుపబడుతున్నాయి.

భారతదేశంలో మరెక్కడా జరుపబడని విధంగా పచ్చని తోరణాలతో కూడిన నిత్య కల్యాణం సప్తగిరివాసునకు అత్యంత వైభవంగా జరుపబడుతున్నాయి. సుప్రభాత సేవ మొదలు ఏకాంత సేవ వరకు జరుగు ఉత్సవాలు 'నిత్యోత్సవాలు'గానూ, సోమ–మంగళ–బుధ–గురు–శుక్రవారాలలో జరుగు విశేష పూజాది కార్యక్రమాలు 'వార జనిత ఉత్సవాలు'గానూ, వసంతోత్సవం, పద్మావతీ పరిణయం, జ్యేష్ఠాభిషేకం, తెప్పోత్సవం, పుష్పయాగం, పవిత్రోత్సవం, బ్రహ్మోత్సవం మొదలగు ఉత్సవాలు 'సాంవత్సరిక ఉత్సవాలు'గానూ నిర్ణయించవచ్చు.

## 1)నిత్యోత్సవాలు

శ్రీవేంకటేశ్వరునకు జరుగు నిత్యోత్సవాలలో సుప్రభాతసేవ, తోమాలసేవ, అర్చన, నైవేద్యం, కల్యాణం, వసంతోత్సవం, డోలోత్సవం, ఉయ్యాలసేవ, ఏకాంతసేవలు ప్రధానమైనవి.

### సుప్రభాత సేవ

వేదపండితులతోనూ, భక్తజనులతోనూ, ఆధ్యాత్మికతత్త్వ విశారదులతోనూ, పాచక-పరిచారక-అధికారులతోనూ, అర్చక స్వాములు పరిశుద్ధాంతఃకరణులై మంత్ర సహితముగ జయవిజయుల అనుజ్ఞతో-



కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే ।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం ॥

- అను సుప్రభాత శ్లోకమును పఠించి ద్వారములను తెరచి లోపలకు ప్రవేశించి, భగవంతుణ్ణి ధ్యానించి, విశేష ఉపచారాలను, నవనీతము ను నైవేద్యం చేసి సేవించెదరు. దీనిని **'సుప్రభాత సేవ'** అంటారు.

### తోమాల సేవ

తిరుమల ఆనంద నిలయంలో శ్రీవేంకటేశ్వర స్వామివారి మూల విరాట్టును, ఉత్సవమూర్తులను, ఇతర విగ్రహాలకు పుష్పమాలలతో, తులసి మాలలతో అలంకరించే కార్యక్రమాన్నే **'తోమాల సేవ'** అంటారు. భుజాల మీది నుంచి వేలాడేట్లుగా అలంకరించే శ్రీవారి పుష్పాలంకరణ విధానాన్ని ''తోమాల'' అంటారు. తొడుత్తమాలై అనే తమిళ పదంతో వచ్చిన మాట 'తోళ్‌మాల'. తొడుత్తమాల అంటే పై నుంచి క్రిందకు వేలాడు మాల అని అర్థంలో తోళ్ మాలై అని పేరు వచ్చింది.

ఆర్జితం చెల్లించిన భక్తులు ఈ సేవలో పాల్గొని స్వామివారిని దర్శించవచ్చు. అయితే సాయంత్రం పూట జరిగే తోమాలసేవ మాత్రం ఏకాంతంగా జరుగుతుంది. ఎవ్వరూ పాల్గొనడానికి వీలు లేదు. ఏకాంగి కాని లేదా జియ్యంగారలు పూల అరనుంచి సిద్ధం చేసిన పూలమాలలను తీసికొనివచ్చి అర్చకులకు అందిస్తూ ఉండగా అర్చకులు శ్రీవారి నిలువెత్తు విగ్రహానికి పూలమాలల్ని అలంకరిస్తారు. ఈ సేవ సుమారు 30 నిమిషాల సేపు జరుగుతుంది. ఇది మంగళ, బుధ, గురువారాలలో ఆర్జిత సేవ. శుక్ర, శని, ఆది, సోమవారాలలో ఏకాంతంలో జరుగుతుంది.

### అర్చన

భగవత్‌శక్తి దినదినాభివృద్ధి కావడానికి గాను చేసే ప్రధాన ప్రక్రియ ఆగమశాస్త్రోక్త **'అర్చన'**. ఈ అర్చనలో ఆవాహనాదిగా అనేక ఉపచారములు చోటు చేసుకుంటాయి. అనేక మంగళకరములైన ఓషధి ద్రవ్యములతోనూ, అనేక పుష్పములతోనూ, తులసి మొదలగు పత్రములతోనూ ఈ అర్చన జరుపబడుతుంది. ధ్రువాది పంచమూర్తులకు, పరిషద్దేవతాగణాలకు, లోకపాల-అనపాయినులకు ఈ అర్చన జరుపబడుతుంది. ఈ అర్చనల్లో సహస్రనామా







లతో, అష్టోత్తరనామాలతో, కేశవాది ద్వాదశ నామాలతో పూజ జరుప బడుతుంది. పురాణంలో చెప్పబడ్డ శ్రీవేంకటేశ్వర సహస్రనామావళి, అష్టోత్తర శతనామావళి, లక్ష్మీచతుర్వింశతి నామావళితో ప్రతి నిత్యం అర్చన జరుగుతుంది. ఈ అర్చన లోకక్షేమార్థం, సర్వజన సుభిక్షార్థం, సమస్త సన్మంగళావాప్త్యర్థం జరుపబడుతుంది.

## నైవేద్యం

పాయసాన్న-దధ్యన్న-గౌవ్యాన్న-చిత్రాన్న-శుద్ధాన్నములతో కూడిన వివిధవంటకాలను సిద్ధం చేసి స్వామికి త్రికాలములందు ఆ యా నియమానుసారం నివేదన చేయుట **'నైవేద్యం'** అనబడుచున్నది. ఇది ఏకాంతముగా జరుగును. ఈ నివేదనను ఆగమశాస్త్రమునందు భోజ్యోపచారము అంటారు. ఇది పూర్తి అయిన తర్వాతనే భక్తులను సర్వదర్శనానికి అనుమతించెదరు.

## కల్యాణం

ఉభయనాంచారులతో కూడిన మలయప్పస్వామిని యాగశాలలో ఉంచి సంకల్పం, హోమం, విశేషపూజలు చేసి గోత్ర ప్రవరలను చెప్పి మహాసంకల్పంతో కన్యకాదానమును నిర్వహిస్తారు. ఆ తర్వాత లాజ హోమము, ప్రధాన హోమము, అక్షతారోపణ చేసి ఆర్జితసేవా భక్తులను ఆశీర్వదిస్తారు. ఇది చక్కని సంప్రదాయ పద్ధతులతో, చక్కని మంత్ర-తంత్ర-గద్య-పద్యాలతో జరుగుతుంది. అనేకవేలమంది



భక్తులు స్వామిని దర్శించి తరిస్తారు. ఇది స్వామికి, ప్రతి నిత్యం జరుగుతుంది. దీనిని "సర్కార్ సేవ" అని కూడా అంటారు. ఇది శ్రీవారి ఆలయంలోపల గల సంపంగి ప్రాకారపు కల్యాణమండపంలో జరుగుతుంది. ఉభయనాంచారులైన శ్రీదేవి, భూదేవి దేవేరులను స్వామికి ఎదురుగా సింహాసనంపై ఉంచి ఈ వివాహపుతంతు జరుపుతారు. స్వామికి ఏనాడు ఈ కల్యాణ ఉత్సవపుసేవ ప్రారంభమైనదో తెలీదుగానీ నేటికీ నిరంతరంగా ప్రతిరోజు ఆర్జితసేవగా జరుగుతుంది.

## వసంతోత్సవం

శ్రీవారికి **'వసంతోత్సవం'** అను పేరుతో సేవను ప్రతినిత్యం మధ్యాహ్నకాలంలో ఆచరిస్తారు. రంగనాయకుల మంటపంలో స్వామిని ఉంచి విష్వక్సేన పూజ-పుణ్యాహం-విశేష అర్చన జరిపి పాలతోనూ, పెరుగుతోనూ, తేనెతోనూ, కొబ్బరి నీళ్ళతోనూ, పసుపు,



చందనం మొదలగు సుగంధద్రవ్యాలతోనూ, అభిషేకం నిర్వహిస్తారు. విశేషనివేదనాదులతో వసంతోత్సవ ప్రక్రియ పూర్తి అవుతుంది. దీనిని శీతలోపచార ప్రక్రియగా వర్ణించవచ్చు. శ్రమ నివారణకై ఈ ప్రక్రియ ప్రతినిత్యం స్వామికి ఆర్జిత సేవగా జరుగుతుంది.

## డోలోత్సవం

"అయన మహల్" (అద్దాల మండపం)నందు స్వామిని ఉంచి వేద మంత్రాలతోనూ, చక్కని నాదస్వరకచేరీతోనూ స్వామిని ఆనందపరచడాన్ని **'డోలోత్సవ'**మని అంటారు. అయన మహల్ నందు అంతటా అద్దములు బిగించి ఉంటాయి. మధ్యలో స్వామి ఉయ్యాలలో ఊగుతుంటాడు. శ్రీదేవీ-భూదేవేరులతో కూడిన స్వామి వయ్యారంగా ఊగుతూ తన స్వరూపాన్ని అద్దంలో చూసుకొంటాడు. సర్వత్రా వ్యాపించి ఉన్న స్వామిని భక్తులు దర్శించి తరిస్తారు.

"డోలాయమానం గోవిందం" అను ప్రమాణ రీత్యా ఉయ్యాలలో ఊగుతున్న గోవిందుని చూసినట్లయితే పునర్జన్మ ఉండదని ప్రతీతి.

## ఉయ్యాల సేవ

ఆలయం వెలుపల కొలిమిమంటపం అను పేరుగల మంటపంలో అనేక నేతి దీపములు వెలుగుతుండగా మధ్యలో స్వామి వయ్యారంగా ఉయ్యాల ఊగుతూ చక్కని వేద మంత్రాలను, పాటకచేరీని, నాదస్వర కచేరీని ఆలకించి నక్షత్ర హారతి, కర్పూరహారతిని గ్రహిస్తాడు. ఇది ఆహ్లాద కరమైన చల్లని సాయంసంధ్యా వేళ జరుగుతుంది. భక్తులు



స్వామిని దర్శించి తరించివారి జన్మచరితార్థం చేసుకుంటారు. ఈ సేవను **'సహస్రదీపాలంకార సేవ'** అని కూడా అంటారు.

## ఏకాంత సేవ

స్వామికి జరుగు నిత్యోత్సవాలలో చివరిది **'ఏకాంత సేవ'**. స్వామి దేవేరులతో నిద్రకు ఉపక్రమించుటను ఏకాంత సేవ అంటారు. షట్కాలార్చన యందు అర్ధరాత్రి పూజ చివరి అంశం. పరివార దేవతలకు ఆవాహన చేయబడిన శక్తులను తిరిగి మూలమూర్తి వద్దకు పంపి విగ్రహములకు కలిగిన శ్రమను పోగొట్టుటకై ఈ ఏకాంత సేవను ఆగమ శాస్త్ర రీత్యా చేస్తారు. పాలు- పండ్లు స్వామివారి వద్ద ఉంచి అర్చామూర్తిని మంచంపై శయనింపచేయుట ఇందు ప్రధాన ప్రక్రియ.

"మంచస్థం మధుసూదనం' అను ప్రమాణ రీత్యా మంచంపై శయనించి ఉన్న మధుసూదనుని యొక్క దర్శనం సర్వపాపహరణంగా ఆగమగ్రంథాలలో చెప్పబడింది.




## 2) వారోత్సవాలు

వారమును ప్రధానముగా నిర్ణయించుకుని జరుపు ఉత్సవాలు వారోత్సవాలు. సోమవారం విశేషపూజ, మంగళవారం అష్టదళ పాదపద్మారాధన, బుధవారం సహస్రకలశాభిషేకం, గురువారం తిరుప్పావడ, శుక్రవారం అభిషేకం నిర్వహించబడును.

## విశేష పూజ

ప్రతి సోమవారం ప్రాతఃకాలంలో ఉత్సవమూర్తులను యాగశాల లోనికి తెచ్చి విష్వక్సేన పూజ, పుణ్యాహం, అగ్నిప్రతిష్ఠ, దత్తం, విశేషార్చన, అభిషేకం, అలంకారం, విశేషమంత్రహోమం, నైవేద్యం మొదలగు వైదిక కార్యక్రమాలతో స్వామికి **'విశేషపూజ'** నిర్వహిస్తారు. ఇది ఆర్జిత సేవ. భక్తులు తమ కోరికలు నెరవేరేందుకు, గ్రహదోష నివారణకు, సమస్త సన్మంగళా వ్యాప్తికి దీనిని జరిపించుకుంటారు.



## అష్టదళ పాదపద్మారాధన

అష్టదళాలతో కూడిన స్వర్ణ పుష్పాలను 108ని ఒక్కొక్క నామమును ఉచ్చరించుచూ స్వామి పాదపద్మాలపై ఉంచుటను **'అష్టదళ పాదపద్మారాధన'** అంటారు.

దీనిని స్వర్ణ పుష్పార్చన అని కూడా అంటారు. ఇది ప్రతిమంగళవారం మధ్యాహ్న కాలార్చనగా జరుగుతున్నది. సుమారుగా దీనిని ప్రారంభించి 35 సంవత్సరాలు కావస్తుంది. స్వర్ణపుష్పసమర్పణ ఉత్తమోత్తమ ఉపచారంగా ఆగమ గ్రంథాలలో చెప్ప







బడింది. స్వర్ణపుష్పాలు ఎప్పటికీ నిర్మాల్యములు కావు. ఇది ఆర్జిత సేవగా స్వామికి జరుపబడుతున్నది.

### సహస్ర కలశాభిషేకం

ఉత్సవమూర్తులకు, భోగశ్రీనివాసమూర్తికి వైభవంగా ప్రతి బుధ వారం జరుగు ఆర్జితసేవ **'సహస్రకలశాభిషేకం'** బంగారువాకిలి నందు



ఉత్సవమూర్తులను ఉత్తరాభిముఖంగా ఉంచి, భోగశ్రీనివాసమూర్తిని తూర్పుముఖంగా ఉంచి చేయు చక్కని వైదిక ప్రక్రియ సహస్రకలశాభి షేకం. మూలమూర్తినుండి కట్టబడిన పట్టుదారంతో భోగ శ్రీనివాస మూర్తిని బంగారువాకిలినందు ఉంచుతారు.

పాలు-పెరుగు-తేనె-పసుపు-చందనము మొదలగు ద్రవ్యాలతో అభిషేకం, విశేషహోమం-నైవేద్యము జరిపి భక్తులను ఆశీర్వదిస్తారు. సహస్ర(1000) కలశాలు స్వామి వార్ల యొక్క అభిషేకంలో ఉపయోగి స్తారు. కావున, ఈ సేవకు 'సహస్ర కలశాభిషేకం' అనే పేరు ఏర్ప డింది. ఈ సహస్రకలశాభిషేకం ఉత్తమోత్తమ అభిషేక విధానమని ఆగమశాస్త్రంలో చెప్పబడింది.

### తిరుప్పావడ

చిత్రాన్నమును (పులిహోరను) రాశిగా పోసి మూలమూర్తికి ఎదు రుగావున్న గరుడునియొక్క స్థానమందు ఉంచి స్వామికి నైవేద్యం చేయుటను **'తిరుప్పావడ'** అని అంటారు. ఇది గురువారపు ఆర్జితసేవ.



దేశ ప్రజలందరూ పాడిపంటలతో సుఖంగా ఉండాలని, ఆహా రానికి ఎటువంటి ఇబ్బందీ రాకూడదని, సర్వసౌభాగ్యాలు కలగాలని, పాడిపంటలు అభివృద్ధి పొందాలని, ఎటువంటి ఈతి బాధలు కలుగ కూడదని సంకల్పాన్ని చెప్పి తిరుప్పావడ సేవను ఆచరిస్తారు.

### అభిషేకం

ఆకాశరాజు తన పుత్రిక పద్మావతిని శ్రీనివాసునకు ఇచ్చి శుక్ర వారంనాడు వివాహం జరిపించాడని, అతనిచే తయారు చేయబడిన కిరీటాన్ని స్వామి శుక్రవారంనాడు ధరించినట్లు పురాణాలు తెలుపు తున్నాయి. దీనికి ప్రతీకగానే స్వామికి శుక్రవారంనాడు అభిషేకం జరిపి నూతనవస్త్రాన్ని ధరింపజేసి కిరీటమును సమర్పిస్తారు.

అభిషేకంలో సుగంధద్రవ్యాలు అనేకాలు చోటు చేసుకుంటాయి. కర్పూరం, పునుగు తైలం, వట్టివేరు, జాజికాయ, జాపత్రి మొదలైనవి ఉంటాయి. ఇది ఆర్జితసేవ. శుక్రవారంనాడు లక్ష్మీ దేవికి ప్రాధాన్యత. ఆనాడు స్వామిని అభిషేకిస్తే సర్వసంపదలు కలుగుతాయని ఆగమ శాస్త్రం చెబుతుంది.

పురాణాలకు, ఆగమశాస్త్రాలకు రెండింటినీ సమన్వయించి భక్తు లను తన్మయత్వ సంపన్నులుగా చేసేది ఈ అభిషేకం.





## 3) సాంవత్సరిక ఉత్సవాలు

ప్రతి సంవత్సరం నిర్ణయింపబడిన మాసంలో తిథిని కానీ, నక్షత్రమును కానీ ప్రధానంగా నిర్ణయించుకుని కొన్ని రోజులపాటు సంకల్పించి చేయు ఉత్సవాలను **సంవత్సరోత్సవాలని, కాలోత్సవాలని** వ్యవహరిస్తారు.

చైత్రమాసంలో వసంతోత్సవం, వైశాఖమాసంలో పద్మావతీ పరిణయం, జ్యేష్ఠమాసంలో జ్యేష్ఠాభిషేకం, శ్రావణమాసంలో పవిత్రోత్సవం, ఆశ్వయుజమాసంలో బ్రహ్మోత్సవం, కార్తిక-ఫాల్గుణమాసంలో తెప్పోత్సవాలు సాంవత్సరిక ఉత్సవాలలో ప్రధానములైనవి.

### వసంతోత్సవం

వసంతఋతువులో, మలయప్పస్వామికి జరిగే ఈ ఉత్సవానికి **'వసంతోత్సవ'**మని పేరు ఏర్పడింది. సుగంధ సంభరిత వికాస పుష్పాలను స్వామికి సమర్పించుటమే కాక వివిధ రకాల ఫలాలను తెచ్చి స్వామికి నివేదించుట కూడా ఈ వసంతోత్సవంలో ప్రధాన ప్రక్రియ.

మధ్యాహ్నకాలంలో అభిషేకం, పుష్పాలతో అలంకారం చేస్తారు. మొదటిరోజు మలయప్ప శ్రీదేవి-భూదేవేరులతో, రెండవ రోజు శ్రీకృష్ణస్వామివారి విగ్రహాలను, మూడవరోజు పై రెండింటితో పాటు సీతారామలక్ష్మణ హనుమాన్ విగ్రహాలను స్వామి ఆలయానికి నైరుతి



భాగంలో ఉన్న వసంతమండపంవద్దకు తెచ్చి నేత్రానందంగా అత్యంత వైభవోపేతంగా ముచ్చటగా మూడురోజుల పాటు ఈ వసంతోత్సవ ప్రక్రియ నిర్వహిస్తారు. రెండవ రోజు ప్రాతఃకాలమున జరిగే రథోత్సవం ఈ ఉత్సవంలో ఒక ప్రాధాన్యత సంతరించుకున్నది. చరిత్రకందని కాలంనుంచి ఈ వసంతోత్సవ ప్రక్రియ జరుగుతున్నది. చైత్రమాసంలోని పూర్ణిమకు ముందుగా మూడురోజులపాటు ఇది జరుగుతుంది.

### జ్యేష్ఠాభిషేకం

ఇది స్వామివారికి నూతనంగా ప్రవేశపెట్టబడిన సేవ. ఉత్సవ మూర్తుల యొక్క శరీర సంరక్షణకై బంగారుకవచమును తయారు చేసి మంత్ర-తంత్ర-ప్రోక్షణాదులతో దానిని పవిత్రీకరించి, ప్రతిష్ఠించి, అభిషేకాదులు-హోమం-కుంభ పూజ మొదలగు ఆగమోక్త వైదికకార్యక్రమాలు జరిపి "ఉభయనాంచారుల"తో కూడిన మలయప్ప



స్వామికి ధరింపచేయుట జ్యేష్ఠాభిషేకం అంటారు. జ్యేష్ఠమాసంలో పూర్ణిమకు మూడురోజులు ముందుగా ఈ జ్యేష్ఠాభిషేక కార్యక్రమం జరుగుతుంది.

### పద్మావతీ పరిణయం

వైశాఖ శుద్ధ దశమినాడు పద్మావతికి, శ్రీనివాసునికి వైభవంగా పరిణయం జరిగినట్టు పురాణాలు తెలుపుతున్నాయి. దానికి ప్రతీకగా



సప్తగిరివాసునకు వైశాఖశుద్ధదశమినాడు, నవమినాడు, ఏకాదశినాడు మూడురోజులపాటు లౌకిక పరిణయకార్యక్రమం జరుగుతుంది.

### పవిత్రోత్సవం

నిత్యమూ జరిగే అర్చనలో ఏవైనా దోషాలు సంభవిస్తే వాటిని నిరోధించి చేసే ప్రక్రియ పవిత్రోత్సవం. ఇది శ్రావణమాసంలో దశమి నుండి ఆరంభమై త్రయోదశి వరకు నిర్వహించబడుతుంది. పట్టుదారాలతో పవిత్రములను తెచ్చి, వైదికక్రియలతో సంస్కరించి వేద మంత్రాలతో హోమాన్ని నిర్వర్తించి, సుమూహూర్త సమయంలో పవిత్ర







మాలను స్వామికి సమర్పించుటయే పవిత్రోత్సవంలో ప్రక్రియ. తిరుమల శ్రీవారి ఆలయంలో ఇది అత్యంత వైభవంగా అర్జితసేవగా ఆచరింపబడుతుంది.

### బ్రహ్మోత్సవం

కన్యామాస శ్రవణ నక్షత్రంనాడు స్వామి ఆవిర్భవించిన రోజు. ఆ దినమున చక్రస్నానాన్ని సంకల్పించి నవాహ్నిక దీక్షిత అంగరంగ వైభవంగా ఆచరించబడేది **'బ్రహ్మోత్సవం'**. ధ్వజారోహణ, వివిధ వాహనసేవలు, కుంభ ఆరాధన, హోమం, ఆలయ బలి, నవసంధి



మొదలగు ప్రక్రియలు వైఖానస ఆగమ శాస్త్రరీత్యా నిర్వహిస్తారు. ఐదు సంవత్సరములలో రెండు అధికమాసములు రాగలవు. ఆ సందర్భంలో నవరాత్రి ఉత్సవాలు చేయటం ఆచారం.

### పుష్పయాగం

బ్రహ్మోత్సవప్రక్రియలో దోషాలు సంభవిస్తే వాటిని నివారణార్థం చేసే వైదిక ప్రక్రియ **'పుష్పయాగం'**. వివిధ రకాలైన పుష్పాలను తెచ్చి శ్రీభూసమేత మలయప్పస్వామికి వేదమంత్రోచ్చారణల మధ్య సమర్పించటమే పుష్పయాగం. ఈ పుష్పయాగంలో విశేష



హోమం, స్నపన తిరుమంజనం, పుష్పసమర్పణ, కుంభ ఆవాహన కార్యక్రమాలు నిర్దేశించబడతాయి.

### తెప్పోత్సవాలు

ఫాల్గుణమాస పూర్ణిమతో పంచాహ్నిక దీక్షిత స్వామివార్ల పుష్కరిణి యందు గల తెప్పనందు శ్రీకోదండరామస్వామివారికి, శ్రీకృష్ణ స్వామికి, శ్రీమలయప్పస్వామికి ఉత్సవాలు చేయుటే తెప్పోత్సవాలు.



### ముగింపు

*'నభూతో నభవిష్యతి'* శ్రీశ్రీనివాస స్వామివారికి నిత్య-వార-మాస-సంవత్సర ఉత్సావాలు ఆయా సంప్రదాయ రీత్యా, వైఖానస ఆగమశాస్త్రోక్తరీత్యా అనుష్ఠింపబడుతూ ఉన్నాయి. భక్తజనులు స్వామిని దర్శించి స్వామి కృపకు పాత్రులగుదురుగాక!

*శ్రీశ్రీనివాసః పరదైవతం నః*





# కైంకర్యమే.. తనువు దాల్చితే....

15

- డా॥ కంపల్లె రవిచంద్రన్



**(నమ్మాళ్వారు వృత్తాంతానికి ఉపక్రమణిక ఈ సంచికలో చదువవచ్చు)**

ఆ తిరువరుదివళనాడన్‌కు ధర్మధరుడు పుట్టాడు. ధర్మధరునికి స్వామే 'చక్రపాణి' అనే పేరుతో అవతరించి, చక్ర పాణి విషయంలో భక్తి కలిగి ఉన్నాడు. అతనికి స్వామే అచ్యు తుడై పుట్టాడు. అతనికి పాటల లోచనుడు లేక శెంగణ్ణన్ అను నతడు కలిగాడు. అతనికి పొరత్కారి పుట్టాడు. అతనికి కారి జన్మించాడు. ఈ కారి రాజుకే నమ్మాళ్వార్లు కలిగారు. నమ్మా ళ్వారు చరిత్రను చెప్పాల్సిన సందర్భంలో పై ఏడుగురిని గురించి చెప్పుకోవడమెందుకు? అంటే, వాళ్లు మహానుభావులు, భగవ ద్భక్తిపారగులు. సప్తఋషులతో సమానమైనవారు. వీరిలో 'కారి' మరింత గొప్పవాడు. శ్రీకృష్ణుని కన్న వసుదేవుడిలాగా, శ్రీరాముని గన్న దశరథునిలాగా, నమ్మాళ్వారును కన్న 'కారి' రాజు అంత గొప్పవాడు. వంశక్రమంలో పొరత్కారి రాజయ్యాడు.

అతడు కుమారునికి వివాహం చేయాలనుకుని కొడుకుతో కలిసి, కన్యాన్వేషణకు బయలుదేరిపోతూ కేరళ దేశంలో తిరువణ్ పరిశారం అనే దివ్యదేశంలో దిగారు. అక్కడ మహాభాగవతోత్తముడైన తిరువార్‌మార్‌గన్ అనే అతని కూతురు ఉదయనంగ అనే యువతికి, తన కొడుకు కారికి పెళ్లి చేసి, సీతను పెండ్లాడిన రాముని పిలుచుకునిపోయిన దశరథుని లాగా కొడుకు, కోడలితో పొరత్కారి తన ఊరికివెళ్లాడు. కారి, ఉదయనంగలు అన్యోన్యంగా కాపురం చేయసాగారు. ఉదయ నంగకు పుట్టింటికి వెళ్లిరావాలని మనసైంది. కారి, భార్యను వదలి ఉండలేక తను కూడా ఆమెతో పాటు వెళ్లి మామ గారింట్లో కొన్ని రోజులు ఉండి, మళ్లీ తను ఊరికి వస్తూ, మార్గమధ్యంలో తిరుక్కురుంగుడి లేక కురంగా అనే నగరానికి చేరాడు. అక్కడ ఒక ధనవంతుడైన వ్యక్తి పండితులకు అధిక ధనాన్నిచ్చి వేదాలు, ఉపనిషత్తులు నేర్పించుచుండెను. అక్కడ మత రహస్యాలన్నీ గ్రహించి కూడా, వైదికమత విద్వాంసుడైన పుత్రుడు కలగాలని తపస్సు చేయసాగాడు. ప్రజలంతా స్వామిని ప్రార్థించి, కారి దగ్గరకొచ్చి-

స్వామి కారిని ఏదైనా వరం కోరుకొమ్మన్నాడు. అందుకు కారి పుత్రుణ్ణి ప్రసాదించమని కోరాడు. స్వామి "ఇతనికి తగిన పుత్రుణ్ణి కదా ఇవ్వాలని" యోచించి "తానే పుత్రునిగా అవతరిస్తానని" చెప్పాడు.

దీంతో తమకు పుత్రోదయం కలుగుతుందని చాలా సంతోషంగా ఎదురుచూస్తున్నారు కారి దంపతులు. ఆ సమ యంలో కలి పుట్టి నలభైమూడురోజులు గడిచింది. భగవం తుడు త్రియుగుడు (మూడుయుగాల్లో అవతరించినవాడు) కనుక, తాను స్వయంగా అవతరించడానికి లేనందువల్ల తన సేనమొదలిని (విష్వక్సేనుని) పంపదలచాడు. "భూలోకానికి వెళ్లి కారికి కుమారుడుగా జన్మించి, సకలవేదశాస్త్రపురాణాల వల్ల అందరూ కృతార్థులయ్యేటట్లు ద్రావిడవేదాన్ని రచించు. పద కొండుమంది ఆళ్వార్లను అవయవభూతులుగా చేసుకుని నీవు అవయవిగా నుండుము" అని ఆజ్ఞాపించాడు.

స్వామి ద్రావిడంలో గ్రంథరచన చేయమనడానికి కారణమేమంటే, పూర్వం శివుడు పార్వతిని పరిణయమాడే సమయంలో దేవతలు, మహర్షులు సభలో నిండుగా ఉన్నారు.





ఉత్తరదిక్కు భారంతో వంగింది. శివుడు విశ్వకర్మను పిలిచి కారణమడిగాడు. అతడు "అగస్త్యుడు లేచిపోయినట్లయితే భూమి సరి అవుతుంది. అందరూ ఒక ప్రక్క, ఇతడొక పక్క ఉంటే సరిపోతుంద"న్నాడు.

అగస్త్యుడు వాళ్లు ప్రార్థించేలోపుగానే అగ్నిదేవుని పంపాడు. అగస్త్య, విశ్వకర్మలు పరస్పరం శపించుకుని, ద్రావిడ భాషకు గౌరవం తగ్గగా, "నా పెళ్లికి వచ్చినవారంతా అల్లాడు తున్నారు. వీరిలా సంకటపడకూడదు." అని శివుడు అభిప్రాయ పడ్డాడు. ఇలా అనుకొని శివుడు తాను సుందరమూర్తి, అని ఇంకా అనేకులుగా పుట్టి ద్రావిడంలో గ్రంథాలొనర్చి ఆ భాషకు గౌరవం తీసుకువస్తానని, చెప్పాడు. అగస్త్యుడు సమ్మతించలేదు, బ్రహ్మ నారాయణుని గూర్చి తపస్సు చేయమంటే చెప్పగా, శివుడు అలాగే చేశాడు. అప్పుడు భగవంతుడు ప్రత్యక్షమై ద్రావిడం వేదానికంటే ఒకతరం గొప్పదయ్యేటట్లు చేస్తానన్నాడు. అగస్త్యుడు సమ్మతించాడు.



ఈ కారణం వల్లే స్వామి ద్రావిడంలో గ్రంథ రచన చేయమని విష్వక్సేనులను ఆజ్ఞాపించాడు. ఆయన కలి ఆది ఒకటో నెల పదమూడురోజులు పోగా ప్రమాధి వైశాఖ, శుక్లపక్ష చతుర్దశి శుక్రవారం కర్కటలగ్నంలో కారి, నాథనాయిక లకు పుత్రుడై జన్మించాడు. అలా జన్మించినా ఆ బిడ్డ ప్రపంచ వాసన లేక కండ్లు మూసుకునే ఉండేవారు. వీరే నమ్మాళ్వారు. వీరికి ప్రహ్లాదుని వలే గర్భంలో ఉన్నప్పుడే ఉపదేశం జరిగింది. ఆ ఊరికోవెలకు సమీపంలో ఒక చింతచెట్టు ఉండేది. ఆ చెట్టు ఆదిశేషుడు. ఆ వృక్షానికి తిరుప్పుళి పంపితే అతడు వచ్చి ఆ చెట్టయి జన్మించి ఉన్నాడు. ఆ వృక్షానికి తిరుప్పుళిఆళ్వారని పేరు.

నమ్మాళ్వారు పుట్టగానే ఏడ్వలేదు. పాలుత్రాగలేదు. విష్వక్సేనులు భగవంతుని మాట తప్పకూడదనీ, పొమ్మంటే పోనని అనకూడదనీ తలచి జన్మించారు. కానీ, ఈ కలికాలంలో కామక్రోధాలు ప్రబలి లోకం చాలా దోషభూయిష్ఠమై పోవడం చేత వారు కన్నుతెఱువకనే ఉండిపోయారు. వారి ప్రబంధం నాల్గవఆయిరం, భగవద్విషయమని పేరు. నమ్మాళ్వార్లు స్వామిని 'తల్లీ' అనే పిలిచేవారు, "తల్లీ! ఈ లోకంలో స్థావరజంగమాలు నీవే! నీవు అణువులో అణువై మహత్తుకు మహత్తై ఉన్నావు. దీనిని విడిచిపోకుండా ఆశ్రయించియున్నావు. ద్రావిడప్రబంధ మొనర్చడానికి పంపావు. ఆ పని త్వరగా చేస్తాను. నన్ను త్వరగా పిలుచుకుని వెళ్లు. నిన్ను చూచిన కండ్లతో పరమదుష్టమైన ఈ లోకాన్ని చూడను, చూడలేను" అన్నారు.

తల్లిదండ్రులు బిడ్డను చూచి ఆశ్చర్యపడ్డారు. ఇక బ్రతు కడనుకున్నారు. పెరుగడని తలచారు. ఆహారం లేక, శుష్కిం పక, తేజస్సు తగ్గక, రోదనం సేయక ఉండే బిడ్డను చూసి వారు ఆశ్చర్యపడ్డారు. పదిరోజులు గడచిన తర్వాత శాస్త్ర ప్రకారం అన్ని క్రియలు జరిపి "మన సంతోషం కోసం జన్మించిన బిడ్డ కాదు. స్వామి ఇచ్చింది. ఆయనకే సమర్పించాలి" అని అభిప్రాయపడి, బిడ్డపై అభిమానాన్ని మాని, ఆదినాథుని సన్నిధికి చేరి అక్కడ బిడ్డనుదించి, పాలు త్రాగించగా తాగలేదు. ఇంట్లోనూ, భగవంతుని సన్నిధిలోనూ ఒకే రీతిగా ఉండే బిడ్డను ఆ సన్నిధి సమీపంలో ఉన్న చింతచెట్టుశాఖలలో ఒకదానికి బంగారుఉయ్యాలకట్టి దానిలో ఉంచారు.

ఆ బిడ్డ మన్మథుని వలే అందంగా ఉన్నందువల్ల 'మారన్' అని పేరుపెట్టారు. పుట్టిందే చాలునని తలచి నిరాశులై ఆ తల్లిదండ్రులు వెళ్లిపోయారు. ఆ బిడ్డ ఉయ్యాల లోంచి లేచి చెట్టుక్రింద కూర్చున్నాడు. లక్ష్మీదేవి విష్వక్సేనుని సంగతి విచా రించింది. తర్వాత స్వామి తన దగ్గర ఉండు విష్వక్సేనునికి సంస్కారం చేయమని ఆజ్ఞాపించాడు.

ఆళ్వారు తిరునగరిలో చెవిటివానివలే, గ్రుడ్డివానివలే, మూగవానివలే నివసిస్తున్న నమ్మాళ్వారుకు సేనమొదలి సకల వేదశాస్త్రాలూ ఉపదేశించి వెళ్లాడు. ఆళ్వారు నిర్దోషుడై, నిరుపద్ర

వుడై, జ్ఞానపూర్ణుడై ఉండి ఆ జ్ఞానంలోనే పెరుగసాగాడు. పదహారేళ్లు అర్చావిగ్రహం వలే అలాగే ఉండిపోయాడు. ప్రాప్తి హీనులు ఈయన నిష్ప్రయోజకుడని తలచి వెళ్లిపోయినా, కొందరు మాత్రం ఆలయంలో స్వామి దర్శనానికి కోవెలకు వచ్చినప్పుడు ఇతడు విరక్తుడు, ఇతనిలో ఏదో దివ్యాంశ ఉందని ఎంచి సేవిస్తుండేవారు. నమ్మాళ్వారు తనను పదిరోజులు ఆశ్రయించినవారికి కోరిన కోర్కెలు తీర్చుతుండేవాడు. ఇలా సాగుతుండగా అయోధ్య నుండి మధురకవులు విచ్చేశారు.

.......

పాండ్యదేశంలో తిరుక్కోళూరులో నారాయణదీక్షితుడనే ఉత్తమబ్రాహ్మణుడుండేవాడు. అతని కుమారుడు మధురకవి ఆళ్వారు. ద్వాపరయుగం ఎనిమిదిలక్షల అరవైవేల ఎనిమిది వందల సంవత్సరం చైత్రమాస శుక్లపక్ష చతుర్దశి చిత్రా నక్షత్రంలో భగవంతుని సన్నిధిలో ఉండే గణనాథుడు కుముదుడనే అతను మధురకవియై జన్మించాడు. అతను మధురంగా కవిత్వం చెప్పేవాడు.

నారాయణదీక్షితులు కుమారునికి ఉపనయనం, విద్యాభ్యాసం చేయించాడు. శ్రీరామకృష్ణులవలే ఇతను పద్నాలుగు విద్యలు అంటే – వేదాలు, శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిష్యం, కల్పం, మీమాంస శాస్త్రం, న్యాయశాస్త్రం, పురాణం, ధర్మశాస్త్రం మొదలైన వాటిని గురుముఖంగా నేర్చుకున్నారు. ఇలా అన్ని విద్యలలోనూ విశేషప్రావీణ్యం సంపాదించి తీర్థయాత్రకు బయలుదేరి దివ్యదేశాలు సేవిస్తూ పరమానంద భరితులవుతూ ఆ పరంపరలోనే అయోధ్యకు వచ్చి శ్రీరామ చంద్రుణ్ణి దర్శించారు.

అక్కడే కొన్ని రోజులుండిపోయాడు. ఒకరోజు రాత్రి అల్పశంకకు వీధిలోకి వెళితే అక్కడ దక్షిణదిక్కులో గొప్ప వెలుతురొకటి కన్పించింది. పెద్ద ఊరో, గ్రామమో కార్చిచ్చుకు కాలిపోతోంది. అనుకుని వెళ్లి నిద్రకు ఉపక్రమించారు. మరుసటిరోజు కూడా యథాప్రకారం అదేస్థలంలో వెలుతురు కనిపించింది. మధురకవులు ఆలోచనలో పడ్డారు. ఊరుకాలిన స్థలంలో ఇంత సమయం గడచిపోయిన తర్వాత కూడా ఇంత మంట కన్పిస్తుందా? అని అనుకున్నారు. అక్కడ ఏదో విశేషముంది, అదేమిటో తెలుసుకోవాలని గట్టిగా అనుకున్నారు. అదే నిర్ణయంతో బయలుదేరారు. సూర్యోదయమైంది. ఆయన ఆయా ఊళ్లల్లో తిరుగుతూ అనేకక్షేత్రాలు దర్శిస్తూ వెళ్ళి వెళ్లి... శ్రీరంగం చేరుకున్నారు.

అయినా ఈ వెలుగు ఇక్కడి నుండి వచ్చిందీ, ఇది ఫలానావారిది అని తెలియరాలేదు. శ్రీరంగానికి దక్షిణంలో యథాప్రకారం వెలుగు కన్పిస్తుండగా మళ్లీవెళ్లి మధురకవులు తిరునగరు చేరి ఆదినాథుని సేవించి తర్వాత తింత్రిణీ వృక్షం క్రింద ఉన్న నమ్మాళ్వారును సేవించారు. ఆయన గతంలో తామెలాంటి తేజస్సును చూచారో, అలాంటి తేజస్సునే నమ్మాళ్వారు కలిగి ఉండడం గమనించారు. నమ్మాళ్వారు వద్ద తప్ప, ఇంకెక్కడా అలాంటి తేజస్సు కనపడలేదు. దీంతో ఇంతటి తేజస్సంపన్నుని ఆశ్రయిస్తే క్షేమం కలుగుతుందని భావించి మధురకవి, నమ్మాళ్వారును గురువుగా భావించారు.

రాత్రంతా సూర్యుణ్ణి చూడాలని ఉవ్విళ్లూరి, తెల్లారగానే సూర్యుణ్ణి చూచినట్లు, మధురకవులు నమ్మాళ్వారును సేవించారు. వారి సమీపానికి వెళితే, వారు కన్నెత్తి చూడలేదు, పన్నెత్తి మాట్లాడలేదు. ఆళ్వారు కన్నుతెరిచిచూస్తే కదా, తనకు సుఖం అని తలచి మధురకవులు పెద్దరాయిని ఎత్తి క్రిందకు కొట్టారు. నమ్మాళ్వారు ఆ శబ్దానికి కన్ను తెరిచారు. "ఇంతవరకూ ఎవరూ నన్ను ఇలా చేయలేదు. నేను చూసేటట్లు చేసి, నాతో మాట్లాడాలని కదా ఇతడిలా చేశాడు." అని భావించి నమ్మాళ్వారు కోపం చేసుకోకుండా, ఇతడు అనుగ్రహింప తగినవాడని ఎంచి ప్రసన్నులయ్యారు.

మధురకవులు నమ్మాళ్వారును సేవించి, "ఆహా! నేనెక్కడ పుట్టి ఎక్కడ పెరిగాను. కార్చిచ్చును చూడాలని కదా వచ్చాను. శ్రీరంగాది మహాక్షేత్రాలకు లేని దివ్యజ్యోతి వీరికి ఉన్నదే, అంత పెద్దరాయి వేసి, వారి సమాధిస్థితికి భంగం కలిగించినా, కోపించక, చల్లని కటాక్షంతో చూస్తున్నారు కదా! మహాభాగ్యం, ఇది కేవలం భగవత్సంకల్పమే కానీ మరొకటి కాదు. ఈ మహాపురుషుడి నేత్రద్వయం విచ్చుకునేటట్లు చేశాను. ఇక మాట్లాడించాలి. ఆశ్రయించడానికి ముందు గురువు యోగ్యత తెలుసుకోవాలి" అనుకున్నారు.

*(ఇంకా ఉంది)*





గృహలక్ష్మి

# మంగళగౌరీవ్రతం

– శ్రీమతి మధురకవి సత్యవతి

మనకు ఎన్నో నోములు, పూజలు, వ్రతాలు ఉన్నాయి. అవి అన్నీ మనమీద కృపతో, మునులు, ఋషులు అనుగ్రహించారు. అలాంటి వ్రతాలలో **'మంగళగౌరీ వ్రతం'** ఒకటి.

ఈ మంగళగౌరీవ్రతం శ్రావణమాసంలో వచ్చే మంగళవారాలలో చేస్తారు. అందుకే దానిని **'శ్రావణ మంగళవారం నోము'** అని కూడా అంటారు.

వివాహమైన సంవత్సరంలో వచ్చే శ్రావణమంగళ వారంలో ఈ నోము నోచుకుంటారు. మనకి కొన్ని దీర్ఘకాలిక వ్రతాలు ఉన్నవి. కొన్ని, కొన్నాళ్లు మాత్రమే ఉన్నవి. ఎల్లప్పుడూ చేసేవి, వరలక్ష్మీ వ్రతం, పోలాల అమావాస్య వంటివి. కార్తిక పూర్ణిమ కూడా అంతే. కొన్నాళ్లు చేసేవి, మంగళగౌరి, అట్లతదియ వంటివి. ఇది అయిదు సంవత్సరాల వ్రతం. స్త్రీలు, తమ మాంగల్యవృద్ధికోసం, సకల సౌభాగ్యం కోసం ఆచరిస్తారు. దీనిని కన్నడం వాళ్లు కూడా చేస్తారు.

క్రొత్తగా వివాహమైనవారు ఆ సంవత్సరంలో ప్రథమంగా వచ్చే శ్రావణమంగళవారం నాడు మంగళగౌరిని పూజించి, ముత్తయిదువులకి వాయనం ఇస్తారు. అయిదుసంవత్సరాలు అలా వ్రతము ఆచరించాక, అప్పుడు ఉద్యాపన చేస్తారు.

ముందుగా, వినాయకుణ్ణి పూజించి, మంగళగౌరిని అర్చించి, ధూప, దీప, నైవేద్యాలు సమర్పించి, అప్పుడు, గోధుమ పిండి లేక బియ్యం పిండితో ప్రమిదలు చేసి, అందులో ఆవునేతితో జ్యోతులు వెలిగించి, ఆ జ్యోతుల మీద ఒక అట్ల కాడను పట్టుకుని, కథ చెప్పుకుంటూ ఆ కథ అయ్యే దాకా, ఆ అట్లకాడను పట్టుకుంటారు. అప్పుడు కాటుక తయారవుతుంది. ఆ కాటుకను, తాను కళ్లకి పెట్టుకుని, ముత్తయిదువులకి కూడా ఇస్తారు.

మంగళగౌరీ వ్రతంలో నానవేసిన సెనగలు వాయనమిస్తారు. సాయంత్రం ముత్తయిదువులని పిలిచి, పళ్లు, తాంబూలం, సెనగలు వాయనమిస్తారు. ఆ కాటుక కూడా ఇస్తారు. వారిని గంధంతో సత్కరించి, కాళ్లకి పసుపు పూసి, పారాణి దిద్ది, మంగళగౌరిగా భావిస్తారు. వాయనమిచ్చేటప్పుడు కూడా, మంగళగౌరి అనే భావనతో "నా చేతిలో వాయనం ఎవరు అందుకున్నారు?" అని ప్రశ్నిస్తారు. అప్పుడు వారు, తానే మంగళగౌరిని అనే భావనతో "నేనే మంగళ గౌరిని" అని సమాధానం ఇస్తారు.

అలా అయిదు సంవత్సరాలు చేశాక అప్పుడు ఉద్యాపన చేసుకోవాలి. ఒక క్రొత్త పెళ్లికూతురికి పెళ్లి పీటల మీద కూర్చుని ఉండగా, ఒక ఇత్తడి కలశంతో, అరిసెలు, మట్టెలు, మంగళసూత్రాలు, నల్లపూసలు, పసుపు, కుంకుమ ఉంచి, దానిని రవికె



**క్రొత్తగా వివాహమైనవారు ఆ సంవత్సరంలో ప్రథమంగా వచ్చే శ్రావణమంగళవారం నాడు మంగళగౌరిని పూజించి, ముత్తయిదువులకి వాయనం ఇస్తారు. అయిదు సంవత్సరాలు అలా వ్రతం ఆచరించాక, అప్పుడు ఉద్యాపన చేస్తారు.**

*జూలై, 25న*
*మంగళగౌరీ వ్రతం సందర్భంగా...*

గుడ్డతో, చుట్టి, మూసి, వాయనమివ్వాలి. అదే ఉద్యాపన. అంతటితో వ్రతం సమాప్తం అవుతుంది.

వ్రత విధానం మాత్రం ఇదే అయినా, కొందరు, వాళ్ల వాళ్ల ఆచార ప్రకారం, ఆనవాయితీని అనుసరించి, వెలిగించే జ్యోతులు, ముత్తయిదువులలో మార్పులు చేసుకుంటారు. కొందరు, మొదటి సంవత్సరం, అయిదు జ్యోతులు వెలిగించి, అయిదుగురు ముత్తయిదువులకి వాయనమిస్తాడు. రెండవ సంవత్సరం పది జ్యోతులు వెలిగించి, పదిమందికి వాయనమిస్తారు. అలా జ్యోతులు, ముత్తయిదువలు, వీరి సంఖ్య పెరుగుతూ, ఆఖరి సంవత్సరంలో ఇరవై అయిదు జ్యోతులు, ఇరవై అయిదు ముత్తయిదువలు అవుతుంది. శ్రావణమాసంలో వానల వల్ల బురదలో, తడినీళ్లలో ఆడవాళ్లు నడుస్తారు. పసుపుక్రిమి సంహారిణి. అది కాళ్లకి రాసుకుంటే, కాళ్లు బరువవడం, పుళ్లు అవడం, అటువంటివి ఉండవు. అలాగే స్వచ్ఛమైన ఆవునేతితో చేసిన కాటుక పెట్టుకుంటే, కళ్లకి అందాన్నివ్వడమే కాకుండా, ఆరోగ్యప్రదం.

## ఈ వ్రతాన్ని ఎవరు ఆచరించారు?

సూతులవారు శౌనకాది మహర్షులకి, చెప్పినటువంటిదీ, నారద మహర్షి, సావిత్రీదేవికి ఉపదేశించినదీ, శ్రీకృష్ణుడు, ద్రౌపదికి వివరించినదీ అయిన ఈ వ్రతం ఉత్తమం అయినది.



ఈ వ్రతాన్ని కొన్ని ప్రాంతాలలో ఈ విధంగా దైవవిగ్రహాలను అమర్చి పూజ చేయడం కూడా కొందరికి ఆనవాయితీగా ఉంది.

సర్వమంగళాలకూ ఆధారం అయిన ఆ తల్లిని మంగళగౌరిని ఈశ్వరుడే పూజించి, త్రిపురాసుర సంహారం చేసాడు. విజయం సాధించాడు. కుజుడు మంగళగౌరిని పూజించి, మంగళవారానికి తాను అధిపతి అయ్యాడు. మందుడనే రాజు మంగళగౌరిని పూజించి, భూలోకంలో రాజ్యం చాలా సంవత్సరాలు పాలించాడు.

ఒక రాజు ఉండేవాడు. అతనికి సంతానంలేదు. చేసిన పూజలు, దానాలు, వ్రతాలు, నోములకూ అంతం లేదు. ఒకరోజు పరమేశ్వరునికి వారిపై కృప కల్గి, సన్యాసి రూపంతో భిక్షకువచ్చి, భిక్ష ఇచ్చేలోపు వెళ్లిపోయేవాడు. అలా రెండుసార్లు జరిగింది. రాణి ఈ సంగతి భర్తకి తెలియపర్చగా అతడు, ముందుగా అన్నీ సిద్ధపరచుకుని సిద్ధంగా ఉండు అని చెప్పాడు. ఆ రాణి అలాగే అన్నీ సిద్ధ పర్చుకుని, ఆ సన్యాసి రాకకై ఎదురు చూడగా, ఆ సన్యాసి, వచ్చి పుత్రపౌత్రులు లేని మీ ఇంట భిక్ష స్వీకరించననీ, నిరాకరించాడు.

అందులకామె సంతానం కలిగే మార్గం తెలుపమనీ ప్రాధేయపడింది. అందులకాతడు "నీల వస్త్రాలు ధరించి, నీలాశ్వధారిగ, నీ భర్తని తూర్పు దిక్కునకు వెళ్లమను. ఎక్కడ, ఆ అశ్వం అలసటతో ఆగి పోతుందో, అక్కడ త్రవ్వమను. అక్కడ ఒక దేవాలయం ఉంటుంది. అక్కడ ఉన్న భవానీదేవిని పూజించినచో, మీ కోరిక ఈడేరగలదు" అని చెప్పాడు. ఆ సంగతి, ఆమె భర్తకి చెప్పగా, ఆ రాజు ఆ విధంగానే చేశాడు. భవానీ సంతోషించి, కావలసింది కోరుకోమనగా... అతడు సంతానాన్ని కోరుకొన్నాడు.

అప్పుడు, ఆ దేవి, "దీర్ఘసుమంగళి అయిన కన్య కావలెనా? అల్పాయుష్కుడైన, కుమారుడు కావలెనా" అని అడుగగా, ఆతడు పుత్రుని కోరుకొన్నాడు. సమీపంలోని మామిడి వృక్షంలో గల ఫలాల్లో ఒక ఫలం కోసి, "నీ భార్య కిమ్మని" చెప్పి అంతర్ధానమైంది దేవి.

అప్పుడు అతడు, ఆ మామిడి వృక్షం సమీపించి ఎక్కువఫలాలు కోసి భార్యకిస్తే, ఎక్కువమంది పుత్రులు కలుగుతారనే, ఆశచేత, చెంతనున్న గణపతి విగ్రహంపై కాలువేసి ఎక్కువ ఫలాలను కోయగా, ఫలాలన్నీ మాయమై ఒక్క ఫలమే మిగిలింది. అప్పుడు గణపతి ఆ అకృత్యానికి, ఆగ్రహంతో, నీకు కలిగే కుమారుడు పదహారవ ఏట సర్పం వలన మరణిస్తాడనీ శపించింది.

రాజు వచ్చి, రాణికి ఫలాన్ని ఇచ్చాడు. రాణికి పుత్రుడు జన్మించాడు. పదహారవ ఏట వివాహం చేయమనీ, రాణి కోరగా, మొదట కాశీకి వెళ్లిరమ్మనింది. తర్వాత వివాహం చేద్దాం అని మేనమామని సాయమిచ్చి, శివుడనే పేరుగల రాజుకుమారుని పంపించాడు.





వారు ఒక నగరం చేరుకున్నారు. ఆ నగరంలో రాజుకి సుశీల అనే కుమార్తె గలదు. ఆమెని స్నేహితురాళ్లు దూషించగా, మా అమ్మ మంగళగౌరీ వ్రతం చేస్తున్నది. మాకు అమంగళాలు జరుగవు అని సమాధానం చెప్పింది.

రాజు శివుని చూచి, ముచ్చట పడి సుశీలతో, శివునికి పరిణయం చేశాడు. ఆ పెండ్లితో సుశీల తల్లి, సుశీలకి మంగళగౌరీ నోము ఉద్యాపనం ఇచ్చింది.

ఆ రోజు రాత్రి నూతన దంపతులు క్షీరలవణాలు వర్జించి, బ్రహ్మచర్య వ్రతులై దర్భాస్తరణాలపై శయనించారు. అప్పుడు, అక్కడికి ఒక కృష్ణ సర్పం వచ్చింది.

అప్పుడా సుశీల భీతి చెందక మంగళగౌరిని స్మరించి, భయంలేకుండా, తల్లి వాయనమిచ్చిన కలశంలో పాలుపోసి, ఆ పాము అందులో ప్రవేశించగానే, ఆ రవిక గుడ్డతో మూసి వేసి గట్టిగా మూటకట్టింది.

ఉదయాన్నే శివుడు, మేనమామతో కలిసి, కాశీకి వెళ్లాడు. సుశీల మంగళగౌరిని ప్రార్థిస్తూ, భర్తరాకకై నిరీక్షిస్తూ తండ్రిని ఒక సత్రం కట్టించమనీ, అందులో అన్నదానం జరిపించమనీ కోరింది. తండ్రి అట్లే చేశాడు. అప్పుడు సుశీల భోజనం చేసిన వారికి తాంబూలం ఇచ్చేది. అలా కొంతకాలం గడచింది. కాశీకి వెళ్లిన శివుడు తిరిగి వచ్చాడు. భోజనం చేసిన వారికి తాంబూలమిస్తూ, సుశీల తన భర్తని గుర్తించింది. అందరూ సంతోషించారు.

అప్పుడు, రాజకుమారుడైన శివుడు భార్యని తీసుకునీ, ఇంటికి చేరుకున్నారు. కుమారుని జాడ తెలియని, తల్లిరోదించి, కళ్లు సరిగ్గా కనిపించని స్థితిలో ఉంది.

సుశీల మంగళగౌరీ నోమునోచుకుని, ఆ కాటుక అత్తగారి కివ్వగానే, ఆమెకి దృష్టి కలిగింది. అందరూ అల్పాయుష్కుడైన భర్తని ఏ విధంగా, ఆయుష్మంతునిగా చేసిందో, తెలపమనికోరగా, ఆమె మంగళగౌరీ వ్రత మాహాత్మ్యాన్ని వివరించి, ఆనాడు, కలశంలో మూటని విప్పి చూపగా, అందులోని పాము బంగారుపాముగా మారి ఉంది. మంగళగౌరీ కృపవల్ల గండం గడచిందనీ, మరే భయంలేదనీ సుశీల చెప్పింది.

ఈ కథ చెప్పుకుంటూ కాటుక పెట్టాలి. సావిత్రీదేవియే ఆచరించిందీ, నారదమహర్షి చెప్పిందీ, శ్రీకృష్ణభగవానుడే ద్రౌపదికి వివరించినదీ, అయిన మంగళగౌరీ వ్రతాన్ని, మన కోడళ్ల చేత, కుమార్తెల చేత ఆచరింపచేసి, ఆ మంగళగౌరి కృపకి మనం దరమూ పాత్రులమవుదాం.

సర్వమంగళ మాంగళ్యే, శివే సర్వార్థ సాధికే ।
త్ర్యయంబికే దేవీ నారాయణి నమోస్తుతే ॥





**తిరుపతి శ్రీగోవిందరాజస్వామివారి జ్యేష్ఠాభిషేకం**

**ప్రతి ఏటా ఆషాఢమాసంలో తిరుపతి శ్రీగోవింద రాజ స్వామివారికి మూడురోజుల పాటు జ్యేష్ఠాభిషేకం నిర్వహింపబడుతుంది. జ్యేష్ఠాభిషేకాన్నే "ఆభిధేయక అభిషేకం" అని కూడా అంటారు. శ్రీదేవి, భూదేవి సమేత శ్రీగోవిందరాజస్వామివారి అత్యంత ప్రాచీనమైన ఉత్సవ మూర్తులు, తరతరాలుగా జరుగుతున్న అభిషేకాలతో, తిరుమంజనాలతో అరిగిపోకుండా తరిగిపోకుండా వైఖానస ఆగమం ప్రకారం పరిరక్షించే ఉత్సవమే జ్యేష్ఠా భిషేకం.**

**జ్యేష్ఠ బహుళ ఏకాదశినాడు అంకురార్పణతో ప్రారంభమైన ఈ ఉత్సవం రెండవరోజు ద్వాదశినాడు బంగారుకవచాల ప్రతిష్ఠ, హోమాలు, ఉత్సవమూర్తులకు పాలు, పెరుగు, తేనె, కొబ్బరినీరు, చందనం, పసుపు మున్నగుద్రవ్యాలతో తిరుమంజనం జరుగుతుంది. మూడవ రోజు త్రయోదశినాడు హోమాలు, తిరుమంజనాదులు అయిన తర్వాత ఉత్సవమూర్తులకు బంగారు కవచాలను అలంకరిస్తారు. ఆ సాయంత్రం పురవీథుల్లో ఊరేగింపు జరుగు తుంది. ఈ కవచాలు మళ్లీ ఏడాదికి జరిగే జ్యేష్ఠా భిషేకంలో మాత్రమే తొలగిస్తారు.**

**ఈ నెల 4, 5, 6 తేదీలలో తిరుపతి శ్రీగోవిందరాజ స్వామివారి జ్యేష్ఠాభిషేకం.**



## సందేహాలు - సమాధానాలు

- డా॥ చిన్నలక్ష్మి కళావతి

**దేవుడికి నైవేద్యం (ఆరగింపు) చేసేటప్పుడు "ఓం ప్రాణాయ స్వాహా" - అంటూ చెప్తారు కదా! ఎందుకు?**

**- కుక్కదపు గోపాలకృష్ణ, తిరువూరు**

 దేవతలకు నైవేద్యం పెట్టేటప్పుడు - విగ్రహమూర్తిలోని పంచ ప్రాణాలూ ఈ ఆహారశక్తిని స్వీకరించి, తృప్తి చెంది, నైవేద్యం సమర్పించినవారిని రక్షిస్తుంటారని భావన. శరీరంలో పంచ ప్రాణా లున్నాయి. అవి 1)ప్రాణ 2)అపాన 3)వ్యాన 4)ఉదాన 5)సమా నములు.

1) ప్రాణమంటే = చక్కగా బ్రతికింపచేసేది, మిక్కిలిగా శ్వాసా దుల్ని బయటికి వెడలించేది - అని అర్థం. హృదయం ప్రాణం యొక్క స్థానం. 2) అపానం = విసర్జన స్థానం. 3) వ్యానం= విశే షంగా బ్రతికింపచేసేది. దీనిస్థానం - శరీరమంతా. 4)ఉదానం= మాటలు మున్నగు శబ్దాల్ని పైకి తెచ్చేది. దీనిస్థానం-కంఠం. 5) సమానం = దేహంలో నెత్తురు మొదలైన వాటిల్ని పొందించేది. దీనిస్థానం - నాభి (బొడ్డు).

కనుక, ప్రాణం - హృదయంలో ఉండి గర్భంలో ఉండే అన్నం మొదలైనవాటిల్ని ప్రవేశింపచేస్తుంది. అపానం - విసర్జనను క్రిందికి పంపుతుంది. వ్యానం - శరీరమంతటా ఉండి, చెమట మొదలగు వాటిల్ని పుట్టిస్తుంది. ఉదానం - కంఠంలో ఉండి, మాటల్ని పుట్టిస్తుంది. సమానం - నాభియందుండి, అన్నం మొదలైన ఆహారపదార్థాల్ని జీర్ణింపచేస్తుంది. ఇలా శరీరం అనే యంత్రం సక్రమంగా పనిచేయటానికి పంచప్రాణాలు ముఖ్యమైనవి. ఇవేకాక - మరో ఐదుప్రాణాలూ ఉన్నాయి. అవి నాగం, కూర్మం, కృకరం, దేవదత్తం, ధనంజయం అనేవి. వీటిలో నాగం-నోటిలో, కూర్మం-కన్ను తెరవడంలో, కృకరం-తుమ్మడంలో, దేవదత్తం-విజృంభణంలో, ధనంజయం-మృతశరీరాన్ని కూడా వదలకుండా శరీరమంతటా ఉంటుంది. ఇలా ఉన్నా - ప్రాణ అపానాదులైన ఐదే అత్యంత ప్రధానాలు కనుక వాటితోనే నైవేద్యం చేస్తారు. దేవతలకు స్వాహా శబ్దంతో అర్పించాలి.

ఇలా అర్పించినప్పుడు దేవతలు తమ దృష్టిద్వారానే నైవేద్య సారాన్ని స్వీకరించి, తృప్తి చెందుతారు. వైదిక విధానంలో మనం భోజనం చేసేముందు కూడా ఈ 'ప్రాణాయస్వాహా...' అనే ఐదూ చెప్పు, మనలోపల వైశ్వానరాగ్ని రూపంలో ఉన్న భగవంతునికి 'పంచాహుతులు' సమర్పించాలి. తర్వాత భోజనం చేయడం సంప్ర దాయం! భగవంతునికి ఆకలిదప్పులు లేక పోయినా భక్తిమార్గంలో దేవుణ్ణి- దేవతామూర్తిని మనవంటి వ్యక్తులుగానే భావించి, అదే సమయంలోనే మనకంటే ఉన్నతుడుగానూ నిర్ణయించి- ఈ విధంగా ఉపచారాలు చేసి, తర్వాత ఆ నైవేద్యాన్ని భగవత్ప్రసాదంగా స్వీక రించడంలో ఎంతో పవిత్రభావన ఉంది.

**షోడశ కళలు, షోడశ ఉపచారాలు ఏవేవో తెల్పండి?**

**- కె.వి.ఎం. భారతి, దాక్షారామం**

 భారతీయులకు తొమ్మిదిసంఖ్యవలె, షోడశ (16) సంఖ్య కూడా విశిష్టమయింది! సంభావనలలో 116, 1116, 10116 ఇలా చివర 16 సంఖ్యను చేర్చడం సంప్రదాయం. మానవజీవిత కర్మలు కూడా 16 సంఖ్యలోనే ఉన్నాయి.

**అ)షోడశకళలు:** చంద్రుడు మనఃకారకుడు. షోడశకళా ప్రపూర్ణుడు. చంద్రుని కళలు 16. ఇవి శుద్ధ పాడ్యమినుండి క్రమంగా పెరుగుతూ, పూర్ణిమనాటికి పూర్ణత్వం చెందుతాయి. బహుళపక్షంలో క్రమంగా తగ్గుతూ వస్తాయి. ఇవి 1)అమృత 2)మానద 3)పూష 4)తుష్టి 5)రతి 7)ధృతి 8)శశిని 9)చంద్రిక 10)కాంతి 11) జ్యోత్స్న 12)శ్రీ 13)ప్రీతి 14)అంగద 15)పూర్ణ కాగా పదహారవది అమృత కళ. ఈ కళను శివుడు తన శిరోభూషణంగా ధరించి, చంద్రశేఖ రుడయ్యాడు. కార్తికపూర్ణిమనాడు శివుడు ఈ 16వ కళాకాంతిని చంద్రునికిస్తాడనీ, అందుకే కార్తికపూర్ణిమ షోడశకళాపూర్ణమవుతుం దని పెద్దలంటారు.

**ఆ)షోడశ ఉపచారాలు:** భగవంతుణ్ణి అర్చామూర్తిగా ఆరాధించేట ప్పుడు షోడశ (16) ఉపచారాలతో అర్చించడం సంప్రదాయం. ఉపచారం అంటే సేవ, సమ్మానం అని అర్థాలు. ఇక్కడ 16 సేవ లతో భగవంతుణ్ణి పూజించాలి. అవి 1)ఆవాహనం 2)ఆసనం 3)పాద్యం 4)అర్ఘ్యం 5)ఆచమనీయం 6)అభిషేకం 7)వస్త్రం 8)యజ్ఞోపవీతం 9)గంధం10)పుష్పం 11)ధూపం 12)దీపం 13)నైవేద్యం 14)తాంబూలం 15)ప్రదక్షిణం 16) నమస్కారం.

ఈ షోడశోపచారాలు ఆయా సంప్రదాయాల్నిబట్టి కొద్ది పాటి తేడాలతో ఉన్నాయి. కొందరు 'వాద్యం, నీరాజనం' మున్నగు నవి చేరుస్తారు. ఇవిగాక పంచోపచారాలు ఉన్నాయి. 1)స్నానం 2)పూజ 3)నైవేద్యం 4)ప్రదక్షిణం 5)నమస్కారం.

సాలగ్రామంలోనూ, స్థిరప్రతిష్ఠ నొందిన దేవతామూర్తుల లోనూ ఆవాహనం, విసర్జనం (రమ్మనడం (ఆహ్వానం), యథాస్థానా నికి వెళ్లమని ప్రార్థించడం) తగదు. ఈ రెంటిలో దేవతలు నిత్యమూ సన్నిహితులై ఉంటారు. అలాంటి చోట్ల ఆవాహనం, ఆసనం అవసరం లేదు. 'పాద్యం'తో ప్రారంభించి, గంధం తర్వాత-అక్షతలు, తాంబూలం పిదప కర్పూరనీరాజనం చేర్చుకోవాలి.







పనిచేసేవాడికి దేనికీ కరువు ఉండదు



శ్రీమన్నారాయణుని సహస్రనామాలలో 'సర్వప్రహరణాయుధః' అనేది ఒక నామం. భక్తుల శత్రువులను నిరసించడానికి కావలసిన అన్ని దివ్యాయుధాలను కలవాడని ఈ నామం యొక్క అర్థం. ఆ విధంగా భగవంతుడు ధరించే దివ్యాయుధాల్లో శ్రీసుదర్శనం అనే చక్రం ప్రముఖమైనది. అందువల్లనే దీనిని శ్రీపరాశర భట్టర్ అనే ఆచార్యులు శ్రీరంగరాజస్తవంలో "అగ్రగ్రామాగ్రేసరమ్" (ఆయుధ సమూహంలో ముఖ్యమైనది) అని కీర్తించారు.

# సుదర్శన మహిమ

- శ్రీమతి ఈ. జయలక్ష్మి

**జూలై, 23**
**శ్రీచక్రత్తాళ్వారు వర్షతిరునక్షత్రం సందర్భంగా..**

శ్రీసుదర్శనానికి సంబంధించిన ప్రస్తావన ఋగ్వేదం నుండే కన్పిస్తుంది. *"పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే! ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః, అలిప్త తనూః న తదామో అశ్నుతే శ్రుతాస ఇద్వహంత స్తత్సమాశత"* అని ఋగ్వేజుస్సామాలు అనే మూడు వేదాలలో కన్పించే సూక్తం శ్రీసుదర్శన వైభవాన్ని తెల్పుతున్నది. (భగవన్! నీ చక్రాయుధం అన్నిటిలో వ్యాపించి ఉంది. ఏ ప్రాణి నీ సుదర్శన చక్రంలో అంకితుడు కాడో, అతని పాపాలు నశించవు. అతడు పరబ్రహ్మను చేరలేడు. అంకితుడైన వాడు అతని పాపాలు తీరి బ్రహ్మప్రాప్తిని పొంద గలడు- అని ఈ సూక్తంలోని భావం). ఈ విధంగా సుదర్శన మహిమను కీర్తించే సుదర్శనోపనిషత్తు కూడా ఒకటి ఉంది. శ్రీవిష్ణుపురాణం, వామన పురాణం, మహాభారతం మొదలైన పలు పురాణేతిహాస గ్రంథాలలో ఈ చక్రాయుధం ప్రస్తావన ప్రచురంగా ఉంది. శ్రీకృష్ణుడు ఒక పర్యాయం ద్వారకను విడచి వెళ్లేటపుడు తాను తిరిగి వచ్చే వరకు చక్రాయుధంచేత అంకితులైన విష్ణుభక్తులను మాత్రమే రేపల్లెలోకి అనుమతించమని, ఆవిధంగా చక్రాంకితులు కానివారిని ప్రవేశించనీయ వద్దని ఆజ్ఞాపించాడని *"చక్రాంకితాః ప్రవేశష్టవ్యాః యావదాగమనం మమ"* అనే మహాభారతసూక్తి తెల్పుతున్నది.

**తిరుమలలో చక్రత్తాళ్వారును శ్రీవారి సహస్రదీపాలంకారసేవామంటపం వద్ద శ్రీవారి తూర్పుప్రాకారంపై దర్శించవచ్చు. అట్లే, తిరుపతిలో శ్రీగోవిందరాజస్వామివారి దేవాలయంలోని శ్రీ పుండరీకవల్లి అమ్మవారి ఆలయం ఎదురుగా ఉన్న మెట్లపైకి ఎక్కి చూడవచ్చు.**

దీనివల్ల శ్రీసుదర్శన చక్రలాంఛనమనేది విష్ణుభక్తులను నిరూపించే అసాధారణలక్షణంగా భావింపబడుతున్నదని తెలుస్తున్నది.

'అహిర్బుధ్న్య సంహిత' అనే పాంచరాత్రసంహిత సుదర్శనశబ్దవ్యుత్పత్తిని నిర్వచిస్తూ *"యత్తత్సూ ప్రేక్షణమిత్యుక్తం దర్శనం తత్ ప్రగీయత్, వస్తుతః కాలతః దేశాత్ తస్యత్వ వ్యాహతిర్ద్వియం, పూజా సా తు సుశబ్దార్థః"* - అని అంటూ భగవానుని దేశకాల వస్తు పరిమితిలు లేని, జగత్సృష్టి హేతువైన సంకల్పమే సుదర్శన శబ్దార్థమని తెల్పింది. ఈ అర్థాన్ని నమ్మాళ్వార్లు కూడా అనువదిస్తూ *"మళుజ్ఞాద ఇనమే పడైయాక"* (మొక్కవోని సంకల్ప రూపజ్ఞానాన్నే సుదర్శన రూపాయుధంగా) అని అన్నారు. సుదర్శన శతకంలో కూడా ఈ అర్థం *"వాణీ పౌరాణికీయం ప్రథయతి మహితం ప్రేక్షణం కైటభారేః"* అని ప్రసాదింపబడగా, వేదాంత దేశికులు కూడా "యదాయత్తం జగచ్చక్రమ్" అని షోడశాయుధస్తోత్రంలో అన్నారు.

పురాణాలలో సుదర్శనుని ఆవిర్భావ వృత్తాంతాలు తెలుపబడ్డాయి. శ్రీవిష్ణుపురాణంలోని కథనానుసారం- సూర్యుని తేజస్సు అతని భార్య ఛాయాదేవి భరించలేనందున, ఆమె ప్రార్థించగా, సూర్య తేజస్సును తగ్గించడం కోసం విశ్వకర్మ సూర్యునియంత్రంలో సానబట్టగా, అపుడు రాలిన చూర్ణంతో సుదర్శనాన్ని నిర్మించి విష్ణునకు ఇచ్చాడని తెలుపబడింది. వామన పురాణోక్తిని అనుసరించి పరమేశ్వరుడు తన తేజస్సును, సకలేతర దేవతల తేజస్సుతో కలిపి సుదర్శనాన్ని నిర్మించి భగవంతుడైన శ్రీమన్నారాయణునకు సమర్పించెనని

 అన్ని అనర్థాలకు కోపమే మూలం

తెలుస్తున్నది. పాద్మోత్తర ఖండంలో కూడా ఈ వృత్తాంతం కన్పిస్తుంది.

ఇక్కడ ఒక సందేహం కలిగే అవకాశం ఉంది. పైన పేర్కొన్న సుదర్శనుని అవతార వృత్తాంతాలను బట్టి చూస్తే, సృష్టి జరిగిన కొంతకాలం తరువాతనే సుదర్శనుని ఆవిర్భావం జరిగిందని తెలుస్తున్నది. సుదర్శనుడు నిత్యసూరికోటి లోనికి చేరినవాడని కదా! అని పురాణవచనం. అపుడతను నిత్యుడు. నిత్యునకు జన్మమరణాదులుండవు కదా! మరి, ఈ అవతారాలు ఏ విధంగా సంభావ్యాలు? అంతేకాక, భిన్నరీతులలో భిన్న భిన్న పురాణాలలో తెలుపబడిన సుదర్శన జన్మవృత్తాంతాలు ఏ విధంగా సమర్థనీయాలు? – అనేది ఆ సందేహం.

అయితే, ఇక్కడ ఒక విషయం గమనించాలి. నిత్య సూరులు కూడా ఆ యా సందర్భాలలో భగవంతుని ఆజ్ఞాను సారంగా ఈ లోకంలో అవతరించడం ప్రసిద్ధమే. సుదర్శనుని విషయంలో తెలుపబడ్డ అవతార వృత్తాంతాలను కూడా ఆ విధంగానే గ్రహించాలి. గరుడ, ఆదిశేషాదుల అవతార వృత్తాంతాలు కూడా అటువంటివే. ఇక, వేరు వేరు రీతులలో వర్ణింపబడిన జన్మవృత్తాంతాలను అభిజ్ఞులు ఆయా భిన్న భిన్న కల్పాలలో జరిగినవానినిగా గ్రహించాలని, అంతే తప్ప, తర్కం చేయరాదని సమాధానించారు.

భగవానుడైన శ్రీమన్నారాయణుడు నిర్వహించే శిష్ట రక్షణ, దుష్టశిక్షణాది కృత్యాలలో సుదర్శనుని స్థానం దొడ్డది. భగవానుని కుడిచేతిలో అమరి ఉండి, ఆ స్వామి మనస్సును

ఓమ్ సుదర్శనాయ విద్మహే ।
మహాజ్వాలాయధీమహి ।
తన్నః చక్రః ప్రచోదయాత్॥

శ్రీవిష్ణుపురాణాలో అస్త్రభూషణాధ్యాయంలో సుదర్శనం మనస్తత్త్వానికి ప్రతీకగా పేర్కొనబడింది. శ్రీమన్నారాయణుని దుష్టశిక్షణ-శిష్టరక్షణ-ధర్మ సంస్థాపన కృత్యాలు శ్రీసుదర్శనుడే చేయుచున్నాడని కాల స్వరూపుడని స్వామివారికి ఆయుధమే కాదు అభరణము కూడా ఈ సుదర్శనుడే అని చెప్పబడినది.




అతడు చెప్పడానికి ముందే గ్రహించి, తదనుసారంగా వర్తించి ఆనందాన్ని కల్గించే సామర్థ్యం సుదర్శనునకు ఉంది. శ్రీకృష్ణుడు కడగంటి చూపుతో సుదర్శనుని వైపు చూడగానే, ఆ స్వామి భావాన్ని గ్రహించి సుదర్శనుడు వారాణసీ నగరాన్ని అరక్షణంలో దహించి వచ్చాడు కదా! (ఇది పౌండ్రకవాసుదేవ వధ వృత్తాంతం) మనసెరిగిన మిత్రునివంటివాడు, స్వామికి సుదర్శనుడు.

భగవానుని హస్తంలో ప్రవేశించే సుదర్శనం కేవలం ఆయుధమే కాదు; ఆభరణం కూడా భక్తులు, సుదర్శనభూషితుడైన స్వామి తిరుమేనిలోని అందాన్ని పారవశ్యంతో దర్శించి కీర్తిస్తారు. **"ఉన్మీలత్ పద్మరాగం కటకమివ ధృతం బాహునా యన్మురారేః"** (మురారి బాహువు చేత పద్మరాగాలు పొదిగిన కంకణం వలె సుదర్శనం ధరింపబడింది) అని శ్రీసుదర్శన శతకంలో సుదర్శనం యొక్క ఆభరణత్వమూర్తి కీర్తింపబడింది. ఆళ్వార్లు కూడా ఈ అందాన్ని **"పొన్ ఆళిక్కై యార్క్కు"** (బంగారు వలె అందంగా మెరిసే సుదర్శనాని ధరించిన బాహువును కలవానిని) అని వర్ణించారు. ఇంకొక చోట **'తిరుమాలురు వొక్కుమ్ మేరు, అమ్మేరువిల్ శెఞ్జదరోన్ తిరుమాల్ తిరుక్కై తిరుచ్చక్కర మొక్కుమ్'** (లక్ష్మీపతి రూపం మేరుపర్వతం వలె ఉంది. ఆ పర్వతంపై వెలిగే సూర్యుని వలె, స్వామిచేతిలోని సుదర్శనం ఉంది) అని మనోహరంగా కీర్తించారు. ఈ విధంగా వాచామగోచరమైన వైభవాన్ని కల్గిన దివ్యాయుధం, దివ్యాచరణం– శ్రీసుదర్శనం.

సహస్రాదిత్యసంకాశ సహస్రవదనం ప్రభుమ్।
సహస్రదం సహస్రారం ప్రపద్యేహం సుదర్శనమ్ ॥






పడిన శ్రమకు ఫలితం లభించినపుడు శ్రమగా తోచదు

# శ్రీసుందరరాజస్వామి ఆలయం

– శ్రీ జె.అనిల్ కుమార్

జూలై, 13, 14, 15 వ తేదీలలో..
తిరుచానూరు, శ్రీసుందరరాజస్వామివారి అవతారోత్సవాల సందర్భంగా...

తిరుచానూరు శ్రీపద్మావతి అమ్మవారి ఆలయ ప్రాంగణంలో శ్రీకృష్ణస్వామి ఆలయానికి దక్షిణంగా తూర్పు ముఖంగా సుమారు 4 అడుగుల ఎత్తైన రాతి అధిష్ఠానం మీద నిర్మింపబడిన ఆలయమే, శ్రీసుందరరాజ స్వామివారి ఆలయం. ఈ ఆలయంలోని స్వామివారిని, శ్రీసుందరవరదరాజస్వామి అనీ, శ్రీసుందరరాజస్వామి అనీ, శ్రీవరదరాజస్వామి అని భక్తులు పిలుస్తారు. ప్రస్తుతం 'శ్రీసుందరరాజస్వామి' అన్న పేరుతో ఈ దేవుడు ప్రసిద్ధమై ఉన్నాడు.

ఈ దేవాలయప్రస్తావన శాసనాల్లో కూడా గోచరిస్తోంది. క్రీ.శ.1541కు చెందిన శాసనంలో వరదరాజస్వామి వారి రథోత్సవాన్నీ గూర్చిన ప్రస్తావన ఉంది. అలాగే 1547 శాసనం. వరదరాజస్వామివారి బ్రహ్మోత్సవాలను, ఆ ఉత్సవాల చివర్లో జరిగే "విధైయాత్రి" వేడుకను గూర్చి పేర్కొంటున్నది. అంతేగాక ఈ శాసనం ఉగాది, దీపావళి, తెప్పోత్సవాలతో పాటు అధ్యనోత్సవాన్ని గూర్చి కూడా పేర్కొంటున్నందువల్ల ఈ గుడి 16వ శతాబ్దం నాటికే నిర్మించబడిందన్న అభిప్రాయాన్ని పరిశోధకులు వెలిబుచ్చుతున్నారు.

సుందరరాజస్వామివారి ఆలయం 1) మహామండపం 2) ముఖమండపం 3) అంతరాళం 4) గర్భాలయం నాలుగు భాగాలుగా నిర్మింపబడింది.

ఈ ఆలయం అలంకృతమైన ఎత్తైన రాతి అధిష్ఠానం మీద నిర్మింపబడి ఉంది. ఈ అధిష్ఠానభాగం ఉపాన, మూడు పట్టికలుగా అనగా పద్మపట్టిక, త్రిపట్టిక, గళపట్టిక భాగాలుగా విభజించారు. అంతేగాక, ఇవి కపోత నాసికలతోను ఆలింగ పట్టికలతోను అలంకృతమై ఉన్నాయి. గోడల వెలుపలి భాగంలో వరుసగా రెండు కుడ్యస్తంభాలు, కుంభపంజరం, రెండు కుడ్య స్తంభాలు, కుంభపంజరం, ఒక కుడ్యస్తంభం, శలకోష్ఠ, ఒక కుడ్యస్తంభం, కుంభపంజరం, రెండుకుడ్య స్తంభాలు, కుంభ పంజరం మరియు రెండు కుడ్యస్తంబాలు అలంకృతమై ఉంది. అంతరాళం గోడలు, రెండు కుడ్యస్థంభాలు, కుంభపంజరం, ఒక కుడ్యస్తంభం శలకోష్ఠ, ఒక కుడ్యస్తంభం, కుంభపంజరం మరియు రెండు కుడ్యస్తంభాలతో అలంకరింపబడి ఉంది.

ఇలాగ ఈ ఆలయం గోడల వెలుపలి భాగాలు అన్ని శిల్పశాస్త్ర సంప్రదాయబద్ధంగా వేసరశైలిలో చక్కగా నిర్మింపబడి ఉంది.

మహామంటపంలో వరుసకు నాలుగు స్తంభాలవంతున మూడు వరుసలుకాక ముందువరుసలో కేవలం రెండు స్తంభాలతో మొత్తం 14 స్తంభాలు ఉన్నాయి. ఈ స్తంభాలు అన్నీ విజయనగర పద్ధతిలో నిర్మించారు.

ముఖమండపం సాధారణమండపంగానే నిర్మించారు. ఈ ముఖమండపంలో అంతరాళ ప్రవేశద్వారానికి ఇరువైపులా ద్వారపాలకులైన జయవిజయుల విగ్రహాలు ఉంది. ప్రవేశద్వార గోడలకు రెండు వైపులా నాలుగు స్తంభాలు నిర్మించారు.

అంతరాళంలో గర్భగుడి ముందున్న గోడ, ప్రవేశ ద్వారం రెండు కుడ్యస్తంభాలతో, కుంభపంజరంలో అలంకృతమై నిర్మింపబడింది.

గర్భాలయం మధ్యభాగంలో సమభంగిముద్రలో స్థానక మూర్తి (నిలిచివున్నమూర్తి) అయిన శ్రీసుందరరాజస్వామివారి శిలావిగ్రహం ప్రతిష్ఠించారు. ఈ స్వామి చతుర్భుజుడై ఉన్నాడు. పైరెండు చేతుల్లో వరుసగా సుదర్శనచక్రం, పాంచజన్య శంఖం, క్రింది కుడిచేయి వరదముద్రలోను, క్రింది ఎడమచేయి క్రిందికి జారవిడచి ఉన్నాడు. సుమారు 8 అడుగుల ఎత్తు ఉన్న శ్రీసుందరరాజస్వామివారికి ఇరువైపులా నిలువెత్తు శ్రీదేవి (కుడివైపు), భూదేవి (ఎడమవైపు) శిలావిగ్రహాలు ప్రతిష్ఠింపబడి ఉన్నాయి. ఈ మూలమూర్తులతో పాటు గర్భాలయంలో సుమారు 3 అడుగుల ఎత్తుతో శ్రీదేవి, భూదేవి సమేతంగా శ్రీసుందరరాజస్వామివారి పంచలోహ ఉత్సవ మూర్తులు కూడ నెలవై ఉన్నాయి. గర్భాలయంపైన ఐదు బంగారు కలశాలతో గోపురం నిర్మించారు.



విశ్వాసపాత్రుడైనవాడే మిత్రుడు

శ్రీసుందరరాజస్వామివారికి ఎదురుగా మహామండపానికి వెలుపల గరుడమండపం ఉంది. ఇందులో శ్రీసుందరరాజస్వామివారికి అభిముఖంగా రెక్కలు విప్పుకొని నిలుచున్న గరుత్మంతుని శిలామూర్తి ప్రతిష్ఠించారు. గరుడుని విగ్రహమూర్తి పరిశీలించినట్లయితే ఈ సుందరరాజస్వామి ఆలయం చాలా ప్రాచీనమైందిగా తోస్తుంది.

పాంచరాత్రాగమ శాస్త్రోక్తంగా శ్రీవైష్ణవ అర్చకులచే పూజాదికాలు నిర్వహింపబడుతున్న ఈ సుందరరాజస్వామివారికి, ప్రతిరోజు మూడుపూటలా అర్చన నివేదనలు జరుగుతున్నాయి. నివేదనలకు వలసిన అన్న ప్రసాదాలన్నీ శ్రీపద్మావతి అమ్మవారి ఆలయ వంటశాల నుండే పంపబడుతున్నాయి.

ప్రతినెలా సుందరరాజస్వామివారి అవతార నక్షత్రమైన ఉత్తరాభాద్ర నక్షత్రంనాడు శ్రీసుందరరాజస్వామివారికి ఉత్సవ మూర్తులకు అభిషేకాదులు, అర్చన, నివేదనలు నిర్వహింపబడిన అనంతరం ఆ సాయంత్రం తిరుచానూరు గ్రామోత్సవం జరుగుతుంది.

ప్రతి సంవత్సరం జ్యేష్ఠమాసంలో పున్నమినాటికి పూర్తి అయ్యే విధంగా తిరుచానూరు పద్మసరోవరంలో శ్రీపద్మావతి అమ్మవారికి ఐదురోజుల పాటు తెప్పోత్సవాలు జరుగుతాయి. అందులో భాగంగా రెండవరోజున సాయంత్రం శ్రీదేవి, భూదేవి సమేతంగా శ్రీసుందరరాజస్వామివారి ఉత్సవమూర్తులకు పద్మసరోవరంలో ఘనంగా తెప్పోత్సవం నిర్వహింపబడుతుంది.

ప్రతి సంవత్సరం జ్యేష్ఠమాసంలో శ్రీసుందరరాజస్వామివారి అవతార నక్షత్రం దినమైన ఉత్తరాభాద్రనాటికి పూర్తి అయ్యే విధంగా మూడు రోజులపాటు శ్రీసుందరరాజస్వామి వారికి వార్షిక అవతారోత్సవాలు ఘనంగా వైభవంగా జరుగుతాయి. ఈ మూడు రోజులపాటు శ్రీసుందరరాజస్వామివారి మూలమూర్తులకు, ఉత్సవమూర్తులకు ఘనంగా అభిషేక అర్చన నివేదనలు జరుపుతారు. ప్రతిరోజు సాయంత్రం ఒక్కొక్క వాహనంపై శ్రీస్వామివారికి ఊరేగింపులు నిర్వహిస్తారు.

సుమారు నూరేండ్లనాడు అనగా క్రీస్తుశకం 1906లో అప్పటి తి.తిదేవస్థానం విచారణకర్తలు అయిన మహంతుల పరిపాలనలో ముఖ్యంగా మహంతు ప్రయాగదాస్‌జీ వారి ఆధ్వర్యంలో శ్రీసుందరరాజస్వామివారి గర్భాలయం, గోపురం జీర్ణోద్ధరణ, ఆలయ శిఖరంపైన బంగారు కలశ ప్రతిష్ఠ, ఆలయ మహాకుంభాభిషేక మహోత్సవాలును నిర్వహించారు. ఆనాటి నుండి శ్రీసుందరరాజస్వామివారికి అవతార మహోత్సవాల పేరిట ప్రతి సంవత్సరం మూడు రోజులపాటు వైభవంగా ఈ ఉత్సవాలు జరుపబడుతూనే ఉన్నాయి. ఇటీవల దశాబ్దం క్రితం 2006 జ్యేష్ఠమాసంలో మహా అవతారోత్సవాలు అత్యంత వైభవంగా ఘనంగా నిర్వహించారు.



దేవేరులతో విరాజిల్లుతూ శంఖచక్రాలతో, వరదహస్తంతో నొసటన వేంకటేశ్వరుని మాదిరిగానే పెద్ద నామాలను ధరించి ఎల్లప్పుడు చిరునవ్వులు చిందిస్తూ పేరుకు తగినట్లుగా మహా సౌందర్యంతో అలరారుతూ దర్శనమిస్తూ సార్థక నామధేయుడై అనుగ్రహిస్తున్న శ్రీసుందరరాజస్వామిని భక్తులు దర్శించుకోవడం సర్వశ్రేయోదాయకం.

**నమః సకలకల్యాణ కారిణే కరుణాత్మనే ।**
**శ్రీవత్సవక్షసే తస్మై లక్ష్మీనారాయణాత్మనే ॥**







దానంతో శత్రువులు కూడా మిత్రులవుతారు

# శ్రీపట్టాభిరామాలయం, వాల్మీకిపురం (వాయల్పాడు)




- డా॥ కె.వి.రాఘవాచార్య

ఈ ఆలయ ప్రాంతంలో వావిలి చెట్లు అధికంగా ఉండటం చేత ఈ పట్టణానికి 'వావిలిపాడు' అను సార్థక నామ ధేయం కలిగింది. ముస్లిం నవాబుల పరిపాలనలో ఈ పట్టణం 'వావిల్-క-పహాడ్' అని పిలువబడింది. ఇది ఆంగ్లేయుల పరిపాలనలో 'వాయల్‌పాడ్'గా పిలువబడింది.

పూర్వం ఈ ప్రాంతంలోని నూరు కొప్పుల కొండ దరిలో బాహుదానది ఒడ్డున శ్రీమద్రామాయణ గ్రంథకర్త వాల్మీకిమహర్షి ఆశ్రమం నిర్మించుకొని తపస్సు చేసినాడని వినికిడి. వాల్మీకి ఆశ్రమానికి సమీపంలో వెలసిన ఈ పట్టణానికి 'వాల్మీకిపురం' అని పేరు కలిగిందని చెబుతారు.

పూర్వం వావిలిపాడు, వాయల్పాడుగా పిలువబడిన ఈ పట్టణం నేడు వాల్మీకిపురంగా ప్రసిద్ధి.

## ఆలయ వైభవం

త్రేతాయుగంలో శ్రీరామభక్తుడైన జాంబవంతుడు ఈ ఆలయంలోని మూలవరులను ప్రతిష్ఠించినట్లు స్థలపురాణం పేర్కొంటున్నది. ప్రధాన ఆలయమైన శ్రీపట్టాభిరామాలయంలో ముందు మహామండపం, ముఖమండపం, అంతరాళం, గర్భాలయం క్రమంగా ఉన్నాయి. మహామండప స్తంభాలపై రమణీయమైన దేవతా విగ్రహాలు చెక్కబడి ఉన్నాయి. ఈ స్తంభాలలో కొన్ని చోళ శిల్పశైలిలో, మరికొన్ని విజయనగర శిల్పశైలిలో మలచబడి ఉన్నాయి.

మహామండపానికి ముందు నాలుగు స్తంభాలతో ముఖ మండపం నిర్మింపబడింది. మండపం పైకప్పులో భువనేశ్వరిలో ఏర్పరచిన స్వస్తిక చిహ్నం, మధ్యలోని అధఃపద్మం ఉన్నాయి. ముఖమండపానికి ఎడంవైపున గల ఉపాలయంలో వీరాంజనేయస్వామి శిలావిగ్రహం పశ్చిమాభి ముఖంగా ప్రతిష్ఠింపబడి ఉంది.

## దేవతా వైభవం

ఈ దేవాలయంలో శ్రీరాముడు ప్రధాన దైవం. గర్భ గుడిలో పూర్వాభిముఖుడైన స్వామికి కుడివైపున సీత, వింజామరతో భరతుడు ఉన్నారు. స్వామికి ఎడమవైపున ధనుర్బాణాలతో లక్ష్మణుడు, వింజామరతో శత్రుఘ్నుడు ఉన్నారు. పెండ్లికి పూర్వపద్ధతులలో వధువు వరుడి కుడివైపున నిలిచేది సంప్రదాయం. ఈ పద్ధతిలోనే ఇక్కడ సీత రాముడికి కుడివైపు నిలిచింది. ఆంజనేయుడు సన్నిధిలో లేని దానికి ఇదే కారణం అనవచ్చు. ఈ ఆలయంలో శ్రీరాముడు తనది ఒకే మాట, ఒకే బాణం, ఒకే పత్ని - ఇది నా వ్రతమని చాటుతున్నట్లు తన కుడి చేతి చూపుడు వ్రేలు పై కెత్తి సూచీముఖ హస్త ముద్రతో శాసన ముద్రతో కనిపిస్తున్నాడు. ఇక్కడ గర్భగుడి ద్వారబంధం శిలలో దశావతార శిల్పాలను చెక్కి ఉండడం ఒక విశేషం.

*జూలై, 28 నుండి 30 వరకు వాయల్పాడు శ్రీపట్టాభిరామస్వామివారి పట్టాభిషేక మహోత్సవాల సందర్భంగా...*



ఉపాలయంలో వీరాంజనేయస్వామి శిలావిగ్రహం

ఈ పట్టాభిరామాలయానికి పశ్చిమదిశలో దక్షిణముఖంగా శ్రీరంగనాథుని ఆలయం ఉంది. ఇందులో శ్రీదేవీ, భూదేవీ సమేతుడైన రంగ నాథుని శయనమూర్తి కొలువై ఉంది. ఆలయం వెలుపల పశ్చిమముఖంగా శ్రీపాండురంగవిఠలే శ్వరాలయం ఉంది. శ్రీపట్టాభిరామాలయానికి తూర్పున కొద్ది దూరంలో పుష్కరిణి ఉంది. దీనిని 'గరుడపుష్కరిణి' అని పిలుస్తారు. ఈ పుష్కరిణిలో పట్టాభిరాముని తెప్పోత్సవాలు జరిగేవి. ఇప్పుడు ఈ పుష్కరిణి, ఇందులో ఉన్న నీరాళిమండపం మంచి స్థితిలో ఉన్నాయి.

## ఉత్సవ వైభవం

ఈ వాల్మీకిపురం శ్రీపట్టాభిరామాలయంలో చైత్రమాస శుక్లపక్షంలో సీతాదేవి జన్మ నక్షత్ర మైన ఆశ్లేషనాడు రాత్రిపూట సీతారామకల్యాణం బ్రహ్మోత్సవాలలో జరుపబడుచున్నది. శ్రీపట్టాభి రామునకు ప్రతి శనివారం, ఏకాదశి నాడు, పునర్వసునక్షత్రంనాడు అభిషేకోత్సవం జరుగు తుంది. ఈ ఆలయంలో ముక్కోటి ఏకాదశినాడు స్వామివారి అభిషేక దర్శనం, ద్వాదశినాడు వైకుంఠద్వార దర్శనం జరుగుతాయి.

## బ్రహ్మోత్సవ వైభవం

వాల్మీకిపురం శ్రీపట్టాభిరామాలయంలో చైత్రమాసంలో వార్షిక బ్రహ్మోత్స వాలు నవాహ్నికంగా శ్రీరామనవమికి మూడు రోజులు ముందు ప్రారంభమై శ్రీరామనవమి తర్వాత అయిదురోజులు (మొత్తం తొమ్మిదిరోజులు) అంగరంగ వైభవంగా జరుగుతాయి. ఈ ఉత్సవాలకు ప్రజలు తండోపతండాలుగా వచ్చి, శ్రీపట్టాభిరాముని సేవించి ధన్యులవుతారు. ప్రతి సంవత్సరం ఉగాదిపర్వదినాన జరిగే ఉత్సవంలో అందరూ పాల్గొని శ్రీరామచంద్రుని ప్రసాదాలు స్వీకరిస్తారు.

## మహిమల వైభవం

క్రీ.శ. 1925-1930 మధ్యకాలంలో కడప జిల్లా కలెక్టరుగా పనిచేసిన హార్డింజ్‌కు శ్రీపట్టాభిరాముని మహిమచేత, అనుగ్రహంచేత ఉదరవ్యాధి నయ మైంది. ఆరోగ్యం చేకూరింది. అప్పుడు కడపజిల్లా కలెక్టరు హార్డింజ్ తన భక్తి విశ్వాసాలకు నిదర్శనంగా పట్టాభిరామాలయానికి ఎదురుగా నాలుగు స్తంభాల మండపం, దానిపై మూడంతస్తుల గోపురం నిర్మించాడు. దీనిని వాల్మీకి మంటపం అంటారు. ఇక్కడ చిన్ముద్రతో ఉన్న వాల్మీకి విగ్రహాన్ని చూడవచ్చు.

## పునర్ వైభవం

వాల్మీకిపురంలోని శ్రీపట్టాభిరామాలయ పురాణ, చారిత్రక ప్రశస్తిని, ఆ రామునికి వేంకటేశ్వరునికి గల సంబంధమును గుర్తించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తరువు మేరకు దేవాదాయశాఖ నుండి తిరుమల తిరుపతి దేవస్థానం 23-2-1997లో వాయల్పాడు శ్రీపట్టాభిరామాలయాన్ని దత్తత తీసుకొని, పరి పాలనా బాధ్యతలను స్వీకరించింది. ఆనాటి నుండి తిరుమల తిరుపతి దేవస్థాన అధికారులు ఆలయ పునరుద్ధరణను, అభివృద్ధిని దశలవారిగా చేస్తున్నారు. దేవాలయం పరిసరాలు శుభ్రపరచి జీర్ణోద్ధరణ చేయబడింది. ఇప్పుడు ఆలయ గోపురాలు చూడటానికి శోభాయమానంగా ఉన్నాయి. మహర్షివాల్మీకి విగ్రహం పునఃప్రతిష్ఠింపబడింది. ఘంటామండపం పునర్నిర్మించబడింది. ఇందులో ప్రాచీనమైన, చారిత్రక ప్రశస్తిగల, సంప్రదాయ చిహ్నములు గల పెద్ద కంచు ఘంట నెలకొల్పబడింది. నిత్యమూ దీనిని ఉపయోగిస్తున్నారు. వాహనాలన్నీ బాగు చేశారు. కొత్తరథం నిర్మించబడింది. గరుడ పుష్కరిణి, అందున్న మండపం బాగుచేశారు. తి.తి.దే. ఆధ్వర్యంలో ఉత్స వాలు కడువైభవంగా, కన్నులపండువుగా జరుగుతున్నాయి. జీర్ణోద్ధరణ, పునర్నిర్మాణ కార్యాలు పూర్తైన తర్వాత శ్రీ పట్టాభిరామునికి పాంచరాత్రాగమరీత్యా 12-8-2005లో మహాసంప్రోక్షణ వైభవంగా చేయబడింది.



**తిరుపతి-మదనపల్లి మార్గంలో, తిరుపతి నుండి 94 కి.మీ. దూరంలో వాయల్పాడు ఉంది.**







దైవం వక్రించినప్పుడు గడ్డిపోచ కూడా వజ్రాయుధమౌతుంది




# ఆపదమొక్కులవాడు

- శ్రీ భాస్కరభట్ల బాలసుబ్రహ్మణ్యం శర్మ

మా కుటుంబ సభ్యులంతా శ్రీవేంకటేశ్వరస్వామివారికి భక్తులం. స్వామివారు మా దైవం. మేము మధ్యతరగతి కుటుంబానికి చెందినవారం. మాకు ఎన్ని కష్టనష్టాలు వచ్చినా, స్వామివారు ఎన్ని పరీక్షలు పెట్టినా స్వామి వారినే నిత్యం ఆరాధిస్తుంటాం.

1998 సంవత్సరంలో నేను, మా నాన్నగారు మరియు ఇతర మిత్రులు కలిసి తిరుమలకు శ్రీవేంకటేశ్వర స్వామి వారిని దర్శించేందుకు వచ్చాం. స్వామివారిని దర్శించుకునే ముందు వరాహస్వామి వారిని దర్శించుకొని మేము ముగ్గురము కలిసి ఆలయం నుండి బయటకు కలిసి వచ్చాం.

కానీ, అనుకోకుండానే మాటలలో పడి మా నాన్నగారు మా ఇద్దరి నుండి విడిపోయారు. మేము ఇరువురం ఆలయం చుట్టూ, కోనేరు చుట్టూ ఎంత వెతికినా మా నాన్న గారు మాకు దొరకలేదు. మేము చాలా కంగారు పడిపోయి, స్వామి వారిని మనసులో ధ్యానించుకొని, నేను ఏమైనా పొరపాటు చేశానా? అని అనుకుంటూ ఉండగా, అనుకోకుండా నా చెవులలో నీవు ఆలయం ముందు ఉన్న మెట్లు ఎక్కగానే మీ నాన్నగారు నీకు కనబడతారని పదే పదే మాటలు వినవచ్చాయి.

అన్నట్లుగానే మొదటి మెట్టు ఎక్కగానే (ఇంతకు ముందు ఆలయం ముందు ఉన్న మెట్లమండపం, కొబ్బరి కాయలు కొట్టు స్థలం) వద్ద మైకులో నా పేరును మా నాన్న గారు అనౌన్స్‌మెంట్ చేయించి నన్ను సమాచార కేంద్రం వద్దకు రావాల్సిందిగా చెప్పారు. మేము అక్కడికి వెళ్లి మా నాన్నగారిని కలిసి, ఇదంతా స్వామి వారి దయ అనుకొని శ్రీవారిని మనసులో ధ్యానించాను.

ఇంకొక సంఘటన. నేను తిరుమల కొండకు వచ్చి స్వామివారి హుండీలో కొంత చిన్న మొత్తం నగదు వేస్తానని ముందే మనసులో అనుకొన్నాను. కానీ, తిరుమలకు రాగానే అనుకొన్న మొత్తం కాకుండా కొంత నగదును స్వామివారి హుండీలో వేశాను. శ్రీవారు నిలువుదోపిడి స్వామి కదా! నేను హుండీలో వేయని మిగతా మొత్తం అనుకోకుండానే నా పర్సులో కనపడలేదు. నేను చేసిన తప్పును మనసులో అనుకొని బాధ పడుతుంటేనే ఒక వ్యక్తి నా దగ్గరకు వచ్చి మీ డబ్బులు క్రింద పడిపోయినవి మీరు చూసుకోలేదు అని నా చేతిలో పెట్టి వెళ్ళాడు, లెక్కచూసుకొని అతనికి 'కృతజ్ఞతలు' చెబుదామని చూసే సరికి ఆ వ్యక్తిని ఎంత వెతికినా కనబడలేదు. మేము ఇదంతా స్వామివారి దయగా భావించి నన్ను క్షమించ మని మనసులో ధ్యానించాను.



మా పెద్ద పాపకు సంవత్సరం పొడవునా జలుబు, ఆయాసం ఉండేది. ఎంతో మంది డాక్టర్లకు చూపినా తగ్గలేదు. నేను స్వామి వారి హుండీలో మొక్కులు వేయగానే ఒక వారం రోజుల లోపే పూర్తిగా తగ్గి పోయింది. మేము స్వామివారి దయ ఉన్నప్పుడల్లా తిరుమలకు వచ్చి స్వామివారిని దర్శించుకుంటున్నాం. శ్రీవారిని మనస్ఫూర్తిగా, ఏ స్వార్థం లేకుండా నమ్మినవారికి కొంగుబంగారం, అందుకే స్వామివారు ఆపద మొక్కులవాడు, అనాథరక్షకుడు.

*ఓం నమో వేంకటేశాయ*



# హరివంశనామసర్వస్వము

రచయిత - పుత్తా పుల్లారెడ్డి, పుటలు - 580, సైజు -1/8 డెమ్మిసైజు, వెల-రూ.300/-
ప్రతులకు - పుత్తా పుల్లారెడ్డి, ఇ.నెం. సి-01-265, మారుతీనగర్, కడప-516 001.
ఫోన్ - 08562-247116. సెల్ - 99592 41001

భారతానికి హరివంశం తోడైతేనే అది మహాభారత మనిపించుకుంటుంది. భారతముతో సరితూగగల గ్రంథం హరివంశం. వ్యాసమహర్షి రచించిన హరివంశాన్ని ఎర్రన తెనిగించాడు. ఎర్రన హరివంశాన్ని ప్రధాన ఆధారంగా తీసికొని పుత్తాపుల్లారెడ్డిగారు 'హరివంశనామ సర్వస్వం' అనుగ్రంథాన్ని కూర్చారు. అయితే దీనికి తోడుగా నాచన సోముని ఉత్తర హరివంశమునూ, విశ్వనాథ నరసింహముగారి ఉత్తర హరివంశ పురాణము ప్రథమ, ద్వితీయ, తృతీయ భాగములను కూడా హేతువుగా తీసుకున్నారు.

రచయిత పై గ్రంథాలను ఔపోశన పట్టి నామసర్వ స్వాన్ని రాశారు. ఈ విషయాన్ని ఈ గ్రంథమే తెలియజేస్తున్నది. ఈ గ్రంథంలో పుల్లారెడ్డిగారు అకారాది క్రమంలో పేర్లను పేర్కొంటూ వాటి స్వరూప స్వభావాలను చక్కగా వివరించారు. ప్రతినామము ఎక్కడ పేర్కొనబడిందో అక్కడికక్కడే సూచిక ద్వారా దాని ఆధారం తెలియజేశారు.

ఈ గ్రంథంలో మొత్తం 3526 నామాలకు వివరణలు ఇచ్చారు. ఒక రకంగా చెప్పాలంటే దీనిని నామవిజ్ఞాన సర్వస్వంగా చెప్పవచ్చు.

గ్రంథాంతంలో దాదాపు 30కి పైగా వంశవృక్షాలను ఇవ్వడం ఈ గ్రంథానికి ఇవి మణిపూసలనవచ్చు. మనం ఎంతో శ్రమిస్తేగాని వంశవృక్షాలను రూపొందించలేం. అలాంటి క్లిష్టమైన పనిని ఇష్టంగా కూర్చారు రచయిత. ఇదొక పెద్ద పరిశోధనాత్మక గ్రంథం. ప్రతి సాహితీవేత్త ఇంట ఉండ దగిన గ్రంథం ఈ 'హరివంశనామసర్వస్వము'. *- డి.సరళ*

## గ్రంథసమీక్ష

# మహాభారతము
## (కవిత్రయ భారత సంక్షేప వచనానుసరణము)

రచయిత - పుత్తా పుల్లారెడ్డి, పుటలు - 876, సైజు -1/8 డెమ్మిసైజు, వెల-రూ.600/-
ప్రతులకు - పుత్తా పుల్లారెడ్డి, ఇ.నెం.01-435-6-1, మారుతినగర్, కడప-516 001.
ఫోన్ - 08562-247116. సెల్ - 99592 41001

భారతీయ సనాతన సంప్రదాయ స్వరూప స్వభావాలను సమగ్రంగా తెలుసుకోవాలంటే శ్రీమహాభారతాన్ని అధ్యయనం చేయాలి. అందులో ధర్మార్థకామమోక్షాలనే నాలుగు పురుషార్థాలకు, వానికి విరుద్ధమైన అధర్మానర్థ దుఃఖసంసారాలనే నాలుగు అంశాలకు సంబంధించిన సర్వవిషయాలూ సూటిగా కథా సమన్వయాత్మకంగా చెప్పబడ్డాయి. ఈ రెండు వర్గాలకు చెందిన అంశాలను తెలుసుకొనుట ద్వారా మనిషి సన్మార్గంలో నడుస్తాడు.

ఈ మహాగ్రంథాన్ని వ్యాసుడు దేవభాష అయిన సంస్కృతంలో రాశాడు. దానిని నన్నయ తిక్కన ఎర్రనలు తెనిగించారు. వ్యాసమహర్షి సంస్కృతంలో, కవిత్రయం పద్యంలో రాశారు. అందువల్ల ఈ మహాభారతం సామాన్య పాఠకులకు అందుబాటులోకి రాకుండా పోతున్నది. ఈ లోటును శ్రీపుత్తా పుల్లారెడ్డిగారు మహాభారతాన్ని ఆంధ్రీకరించుట ద్వారా తీర్చారు.

పుల్లారెడ్డిగారు పద్దెనిమిది పర్వాల మహాభారతాన్ని వచనంలోకి తెనిగించారు. భారతంలోని 677 అంశాలను సరళసుందరమైన భాషలో వివరించారు. ఆదిపర్వంలోని భారత వంశక్రమము మొదలు స్వర్గారోహణ పర్వములోని భారతమాహాత్మ్యం వరకు మూలభారతాన్ని అనుసరిస్తూ అనువదించారు. మూలానికి ఎక్కడా హాని కలుగకుండా ఈ గ్రంథ రచనలో రచయిత తీసుకున్న శ్రద్ధ చాలా ప్రశంసనీయమైనది. మూల భావం, తత్త్వం పాఠకుని హృదయానికి హత్తుకునేటట్లు సందర్భానుకూలంగా పద్యాలు కూడా చేర్చి గ్రంథానికి వన్నె తెచ్చారు. ఈ గ్రంథంలో 275 కవిత్రయ భారతంలోని పద్యాలు ఉన్నాయి. వీరు ఉటంకించిన పద్యాలు ఆణిముత్యాలు.

రచయిత వృత్తి రీత్యా ఇంజనీరు. ప్రవృత్తి రీత్యా ప్రతిభ కలిగిన సాహితీవేత్త. వీరు ఈ గ్రంథంలో ఎక్కడా అక్షరదోషాలు దొర్లకుండా తగిన జాగ్రత్తలు తీసుకున్నారు. భాష సరళ వ్యావహారికంలో ఉంది.

పండితుల మొదలు సామాన్యపాఠకులవరకు అందరూ చదవదగిన ఉత్తమగ్రంథం ఇది. పాఠకులు వీరి గ్రంథాన్ని చదివి, ఆ తర్వాత మూలభారతాన్ని చదివితే భారతంలోని వైశిష్ట్యం సులభంగా బోధపడుతుంది. ప్రతి ఇంట, గ్రంథాలయంలో ఉండదగిన గ్రంథమిది. *- డా॥ కె.రెడ్డెప్ప*

## ఆగష్టు, 2017 రాశిఫలాలు

బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటకృష్ణపూర్ణప్రసాద సిద్ధాంతి,
తి.తి.దే. ఆస్థానసిద్ధాంతి, రేలంగి



**మేషం:** వ్యాపారవాణిజ్యములకు ప్రతికూల వాతావరణం. సామాన్య ఫలితాలు. గృహనిర్మాణంలో పురోగతి లేకపోవడం, మానసిక స్థిమితం లేకుండా ఉంటుంది. పూర్వపు స్నేహితులవలన లబ్ధి పొందుతారు. మాసాంతంలో మంచి ఫలితాలుంటాయి.



**వృషభం:** సంతానం విషయంలో ముందంజ, ధన లాభము, ఇష్టకామ్యసిద్ధి. శరీరంలో రోగాలు తొలగి సౌఖ్యాలు, బంధుమిత్రుల కలయిక, ధన సిద్ధి, సంతోషం కల్గుతాయి. గృహంలో శుభకార్య నిర్వహణ 'మంగళతోరణాలు' బంధువుల రాకపోకలు, ఆనంద కరమైన వాతావరణం ఏర్పడుతుంది.



**మిథునం:** జన్మరాశిలో శుక్రుడు శరీరఆరోగ్యం ఇస్తాడు. భోగభాగ్యాల్ని అనుభవించడం, పది మందిని ఆకట్టుకునే విధంగా మాటలాడడం, న్యాయ సలహాలు ఇస్తారు. ఖచ్చితత్వాన్ని సాధిస్తారు. వృత్తి వ్యాపారాల్లో విజయం లభిస్తుంది.



**కర్కాటకం:** వ్యాపారాల్లో అధికలాభం కలుగుతుంది. ఇతరులకు మార్గదర్శకులవుతారు. పిల్లల చదువుకోసం ధనం ఖర్చుచేస్తారు. అనుకున్న పనులు కలసివస్తాయి. ఆర్థికంగా లాభపడతారు. సమాజంలో గౌరవ ప్రశంసలకు లోటు ఉండదు. సర్వత్రా జయం. కుటుంబంలో శుభకార్య నిర్వహణ.



**సింహం :** గృహ వాతావరణం అనుకూలం. శుభ కార్యక్రమాల్లో బంధుమిత్రులతో కలసి ఆనందం అనుభవిస్తారు. పరిచయాలు పెరుగుతాయి. ఆదాయ మార్గాలు మెరుగవుతాయి. తగిన ఖర్చు ఉంటుంది. నూతన వ్యాపారాలు కలసి వస్తాయి. క్రొత్త వ్యక్తులతో భాగ స్వామ్యం ఉంటుంది.



**కన్య:** ఆధ్యాత్మికంగా ముందుంటారు. శరీర ఆరోగ్యం బాగుంటుంది. చేసే వృత్తి వ్యాపారాలలో అధికలాభం కలుగుతుంది. బాకీలు వసూలు అవుతాయి. వ్యవసాయదారులు హుషారుగా ఉంటారు. కూరగాయలు, పండ్ల వ్యవసాయదారులకు, వర్తకులకు లాభం.



**తుల:** రాజకీయ వ్యవహారములు చాకచక్యంగా చేయగల్గుతారు. మీ మాటసహాయం కోసం అందరూ ఎదురు చూస్తారు. గృహమున జపహోమాది ప్రక్రియలు చేస్తారు. చాలాకాలంగా ఎదురు చూసే కార్యాలు పూర్తవుతాయి. ఆకస్మిక ధనలాభం ఉంటుంది. ఉద్యోగం విషయంలోనూ ఉన్నతి కలుగుతుంది.



**వృశ్చికం:** నెల రెండవభాగంలో పోయిన ద్రవ్యం దొరుకుతుంది. చేసే వ్యాపారంలో లాభాలు కలుగుతాయి. శనైశ్చరునికి అభిషేకాదులు చేయడం, మృత్యుంజయజపం చేయించడం వల్ల, ఈశ్వరాధనచే అపమృత్యుదోషము తొలగి అన్నింటా విజయం సాధిస్తారు.



**ధనుస్సు:** శుభాశుభ ఫలితాల మిశ్రమాలు. కార్యదీక్షతో ముందుకు నడుస్తారు. నూతన వ్యాపారావకాశములు లభిస్తాయి. యత్న కార్య సిద్ధి. ఉద్యోగ విషయంలో ఆశించిన ఉన్నతి కలుగుతుంది. సహచరులను కలుపుకుపోతారు. వారి అందదండలు మీకు లభిస్తాయి. వ్యవసాయ దారులకు లాభిస్తుంది.



**మకరం:** గృహాన శుభకార్యనిర్వహణ, మాసారంభములో గ్రహశాంతులు హోమాదిక్రియలు చేయడం, పుణ్యక్షేత్ర సందర్శన తలపెట్టిన కార్య క్రమాలు సక్రమంగా నిర్వర్తించుట, బంధుజనాలతో ఆనందం. సుబ్రహ్మణ్య ఆరాధన చేయడం మంచిది.



**కుంభం:** యత్నకార్య సిద్ధి, సుఖసంతోష జీవనం, ధనధాన్య వస్త్రాదిలాభాలు, వృత్తి వ్యాపారాలలో లాభం పెరిగి నూతన గృహారంభం నిర్మాణం యోచన చేస్తారు. అన్నింటా కలసివస్తుంది. నెలాఖరులో అన్ని విధాలుగా బాగుంటుంది.



**మీనం:** గృహంలో శుభకార్యనిర్వహణ, అందరికీ చేయూతగా ఉంటారు. శ్రమకు ఓర్చి కార్య భారాన్ని నిర్వర్తించి పదిమందిచే ప్రశంసింపబడుతారు. అందరినీ ఆదరించడం, కార్యనిమగ్నులై ఉంటారు. అందరి ఆదరాభిమానాలను చూరగొనడం జరుగుతుంది.



కోరికలు అనుభవించేకొద్దీ ఇంకా పెరుగుతాయే కాని తరుగవు

